శ్రీ సాయీ నిలయము ప్రచురణము - 9

# సాయీ బాబా కూడా దేవుడేనా?

## ఉన్న దేవుళ్ళు చాలకనా? (సందేహనివృత్తి)



రచయిత :

కి.

శ్రీ సాయీ నిలయమ్, చెరువు (P. O.)

PIN 522 113.

మూల్యము రు. 8/-

| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణము 1960 | 1000 | ప్రతులు |
| ద్వితీయ ముద్రణము 1968 | 1000 | ,, |
| తృతీయ ముద్రణము 1979 | 1000 | ,, |

శాస్త్ర గురుబోధలను మఱి స్వానుభవము
కలిమి, నెద్దాని నరుఁడేడు గడఁగ నమ్మ
నదియె శ్రేష్ఠంబుఁ బరమమౌ నదియు, యాదె జ
గంబునన్ వాని కవలంబనంబు. సాయి !

రచయిత.

ఓమ్

శ్రీ సాయీ ప్రసన్న : శ్రీసాయీసమర్థ

# సాయీబాబా కూడ దేవుడేనా ?

## ఉన్న దేవుళ్ళు చాలకనా ?

(సందేహ నివృత్తి)



ఈశ్వరవ్యాప్తమైయుండు నీసమస్త-జగమునన్ గల వస్తువేదల్పమే, య
పాధినిఃద్యజించ, యా పరేశ్వరు భజింపు: మిచ్చపేయకు మెవ్వరిదేధనమ్ము:


రచయిత :

బాపట్ల హనుమంతరావు

శ్రీ సాయీకుటీరం

చిన్నగంజాము.

# మిత్ర ప్రశంసాశీస్సులు

జిజ్ఞాసుల సంశయములఁ
బ్రజ్ఞామతిఁ దీర్ప 'సాయి' పలికించిన నీ
విజ్ఞానోక్తులు సుమన
స్సజ్ఞేయము లగుచు దైవ సుముఖతఁ గూర్చున్ !

చీరాల
12-12-60 } బందా ఆదినారాయణ.

---

సాయీనాథు చరిత్రమున్ దదుపదేశంబుల్ దయా సూక్తులున్
ధ్యేయంబై, యవగాహ్యమై, విమలమై దివ్యాపగా మాధురీ
స్థాయింగాంచ రచించినాఁడవివి, యాతారా శశాంకార్కమై
శ్రేయంబుల్ సమకూర్చుతన్ బ్రజల కుర్విన్ : శ్రీ హనూ
మత్సుధీ !

బాబా పలికించిన విధి
బాబా చరితములు పలుకఁబడె నీచేతన్;
బాబా కీర్తియు నుడి విను
నా బిడ్డల కిహపరంబు లతి సుఖదములౌ !
ఎంతటి విముఖుండైనను
సుంతేన్ శ్రీసాయి సూక్తి సుధఁ జవిచూడన్
సంతుష్టమతినిఁ బాదా
క్రాంతుండై సాయినాథు కరుణను బడయున్.

సత్యనారాయణపురము
విజయవాడ
14-12-1960. } సుసర్ల రామమూర్తి.

# తొలిపలుకు (తృతీయ ముద్రణకు)

భగవానుడు భక్తసులభుడు, అనంతుడు, సర్వాంతర్యామి. ఈప్సి తార్థ సంధాత :

"యదా యదాహి ధర్మస్య గ్లా నిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్,"

అధర్మము పెచ్చు పెరిగి, స్వధర్మము మరచి, ప్రతీకార మనస్కులై ప్రలోభపడులైన మానవులను సక్రమమార్గమున నడిపించి, పాపప్రక్షాళనముచేసి, క్షణభంగురమైన జీవితములను ధర్మమార్గమున నడిపింప తనకుతానే పెక్కురూపుల జన్మించెదనని గీతాకారుని బోధ.

సర్వమతములలోని మూలగ్రంథాలలో చెప్పబడిన ఆధ్యాత్మికజీవిత సూత్రాలను పాటించి తత్సాధనకు జీవితాలను అంకితం చేసి మానవుడు సాధనద్వారా భగవంతుడు కాగలడని అనుభవపూర్వకంగా చాటిచెప్పగల వారే మహాత్ములు. ప్రాపంచిక ప్రకృతిశక్తులకు బానిసయై మనిషి జీవించి దుఃఖసాగరంలో మునిగి వుండనవసరంలేదనీ, తానే అట్టి ప్రకృతిశక్తుల కాధారమైన విశ్వచైతన్య స్వరూపుడై శాశ్వతానందములో జీవించవచ్చునని మహాత్ముల చరిత్రలు నిరూపించాయి. అట్టిమహనీయులలో శ్రీస్వామి వివేకానంద, శ్రీ ఆదిశంకరాచార్యులు శ్రీ రాఘవేంద్రస్వామి, శ్రీ అక్కల్ కోట మహారాజు శ్రీ మెహర్‌బాబా, శ్రీ సాయిబాబా మొదలగు సిద్ధపురుషులు గలరు.

లోకంలో ధర్మగ్లానినావహించి ప్రజానీకం లౌకిక కష్టాలుపాలవడం వలన యినుపముక్కలోవున్న అయస్కాంత ధర్మాన్ని మరొక అయస్కాంత సంపర్కంతో మేలు కొలిపినట్లు 'ఓం సాయీ' అనేగురుపు

సామాన్యుడు అనే భక్తునకు జ్ఞానం ప్రసాదించడానికి సాక్షాత్తూ శ్రీరామ చంద్రుడే యీ అవతారమెత్తాడు అనడంలో అతిశయోక్తిలేదు.

స+ఆయీ = సాయీ

స = అమ్మతో కూడిన వాడు : అమ్మ = ప్రకృతి

ఆయీ = పురుష శబ్దము – పురుషుడు

సీతా సమేతుడైన రాముడు కరుణామయుడు. ఇక్కడ ప్రకృతితో కలిసివున్న పురుషుడు. శ్రీసాయీ భగవానుడు ఆశ్రితజన రక్షకుడు – భోళాశంకరుడు – దత్తాత్రేయ రూపుడు. శ్రీరామచంద్రుడు రాక్షస సంహారమునకు మానవావతార మెత్తి భక్తసులభుడైనట్లు శ్రీకృష్ణుడు మహాభారత యుద్ధానికి సూత్రధారుడై, దుర్యోధనాది దుష్టులను సంహరింపజేసి గీతాకారుడైనట్లు, కలియుగ దైవమైన శ్రీవేంకటేశ్వరస్వామి మానవరూపమున కాశీ రాజకుమార్తె పద్మావతీదేవిని పెండ్లియాడి, శిలాకృతినిదాల్చి మనల ననుక్షణము రక్షిస్తున్న రీతి; శ్రీ సత్యనారాయణ స్వామి మనలను కాపాడు విధంబున మన శ్రీసాయీనాథుడు మానవుడై జన్మించి భక్తకోటికి కొంగుబంగారమై పరమభక్తితో ధ్యానించి స్మరించు వారికి షిర్డి సమాధినుంచి "ఓయ్" అని పలికే కరుణాంతరంగుడు మహా మహిమాత్ముడుగ ప్రసిద్ధి నొందెను. "సాయీ" శబ్దమునుండి "ఈశా" శబ్దమును వెలువడినది. "శ్రీరామ" శబ్దము వశిష్ఠుని నోటినుండి వెలువడిన రీతి, మహల్సాపతి నోటి "శ్రీసాయి" నామం ప్రకటితమైనది. 'శ్రీసాయీ' శబ్దవాచ్యమైన వస్తువు కేవలం సచ్చిదానంద పరబ్రహ్మము కావున శ్రీరామ నామమున కెట్టిమహత్తు గలదో శ్రీసాయీ నామమున కంతటి మహత్తు సిద్ధించినది. శ్రీరామ, శ్రీసాయి నామములు భవతరణ, తరణములైనవి.

సృష్టి స్థితిలయముల గావించు సర్వేశ్వరుడు సర్వవ్యాపి. అట్టి భగవంతుని ప్రసన్నత బడయుటకు మానవుడు ప్రగాఢ భక్తితో ప్రార్థించ

వలెను. అన్ని జన్మల్లోనూ అనంతమైనది, అపూర్వమైనది. సర్వోత్కృష్ట మైనది. మానవజన్మ చతుర్విధ పురుషార్థములలో ధర్మాన్ని అవలంబించు టం ద్వారానే మిగిలిన అర్థకామములను జయించి మానవుడు మోక్షప్రాప్తి నొందగలడు.

వ్యష్టి రూపములోనున్న వాస్తవికత
సమత సమకాదిలా భావసాక్షి తోడ
జగము లయమగు చున్నది జన్మవిడిచి
నీదు రూపము మాత్రము నిగ్గుదేరె.

గురువులకు గురువు శ్రీసాయినాధుడు. అట్టి సాయిబాబాను ప్రతి వారూ స్తుతించి, జీవన్ముక్తి పొందగలరు.

జగమంతా రామమయం – యీ జగమంతా సాయీమయం – మన మంతా సాయి జనం – మనసంతా సాయి జగం.

శ్రీసాయి ప్రభువు దైవమనుటకు కొన్ని నిదర్శనములు ముచ్చ టించెదను.

మా తండ్రిగారు శ్రీ తాతపూడి భైరవరామమూర్తి భాగవతార్ గారు శ్రీసాయిబాబా భక్తులు – హరికథక విద్వాంసులు – ప్రసిద్ధ నారాయణదాస శిష్యులు, శ్రీదీక్షితదాస అభిమానపాత్రులు. "హరికథా సుధానిధి" బిరుదాంకితులు. కాకినాడలో వార్షికంగా శ్రీ వాడ్రేవు రామారావుగారు చేయు శ్రీసాయి సమారాధనోత్సవాలలో పాల్గొనేవారు. కాని, 1950 లో వారికి పెద్దజబ్బుచేసి, నలభై లంకణములు జరిగి పరిస్థితి తీవ్రమై మాటలేక అంతిమ ఘడియలు సమీపించెనని భావించి, వారిని క్రిందకు దింపిన నిషక్ష పరిస్థితిలో "ఓరేయ్–బేటా, ఇక్కడ నేనుండ నీకెందుకురా భయం." అని బాబా అభయప్రదానమిడి కాళ్ళదగ్గర పెద్ద డైనమైట్ శబ్దమై ఉలిక్కి

పడి లేచి, కూర్చుని మమ్ము ఆనందసాగరములో ముంచెత్తారు. మాతండ్రి గారు బాబామహిమవలన షష్ఠిపూర్తి చేసుకొని సంపూర్ణరామాయణ కథ గానంచేస్తూ దారుఢ్యముగా వుండి బాబాసేవ నిత్యంచేస్తూ యున్నారని చెప్పుటకు నేను గర్వపడుచున్నాను. "నేనివ్వ దలచినది నాభక్తుడడిగే వరకూ, వాడడిగినది వాడికిస్తూనే వుంటాను. అలాగే నాకు వాడేమైనా ఋణపడి వుంటే తీసుకోకుండా వదలను. నన్ను నమ్మి ఆశ్రయించి,శరణు జొచ్చిన వానిని నిరంతరమూ రక్షించుటయే నా కర్తవ్యము!" అని సగర్వంగా చెప్పిన మహాయోగి — యతి—ఋషి—శ్రీసమర్ధ సద్గురు సాయీనాథ మహరాజ్!

శ్రీసాయీప్రభుని పిలుపులేనిదే షిరిడీవెళ్ళుట భక్తులకు సాధ్యం కాదు. చిన్ననాటినుంచి షిరిడి దర్శించవలెనను నాప్రగాఢవాంఛ. 8—2—1978న సోదరసాయీభక్తులు శ్రీ వి. నారాయణరావుగారి ప్రోత్సాహంతో నెరవేరింది. రిజర్వేషను దొరకని స్థితిలో వారు ఎక్కినపెట్టెలోనే నాకు సీటు దొరికింది. 10—2—78 మధ్యాహ్నహారతి సమయమునకు బాబా సమాధి మందిరము చేరితిని. అది తన్మయత్వమో, ఆనందమో, ఆదివ్య మంగళస్వరూపిణి విగ్రహం చూచే సరికి చెప్పలేని దుఃఖమువచ్చి బొట బొటా కన్నీళ్ళురాలి నాబాధోపశమనమైంది. తిరుగుప్రయాణమున 'ద్వారకామాయి' యందు 'ఊధి' తీసుకొని "బాబా! శలవిప్పించవా ?" అని కోరినప్పుడు గంటమ్రోగినది.మధ్యాహ్నం గం.2—20 బస్సుకు రిజర్వుచేయిస్తే ఒంటిగంటకే స్పెషల్ బస్సులో మమ్మలను మన్మాడు చేర్చారు బాబా షిరిడీలో వెయింగుమిషను మీద బరువు చూసుకుంటే అకార్డువెనుక "Cultivate Clean Habits, you will enjoy the devotion o: receprocated love" అని వచ్చి నాజన్మ చరితార్ధమైనది.

3-8-78 (గురువారం) నాడు ఉస్మానియా ఆసుపత్రిలో శస్త్ర చికిత్స పొందుటకై యింటివద్దనుండి బయలుదేరాను. ఏదో అపశకున మైనది. ఐనా ఆగలేదు— ముందు వెళుతున్న లారీమీద "గురుకృప" అనే అక్షరాలు వున్నవి; అంటే బాబా "నేనున్నాను. నీకు భయంలేదు," అని చెప్పినట్లేకదా! నాకు శస్త్రచికిత్స చేసిన డాక్టర్ శ్రీ జాస్తి పూర్ణచంద్ర రావుగారు కూడ సాయీభక్తులు కావడం, బాబా ఆయన రూపంలో వచ్చి నాకు స్వస్థత చేకూర్చారు. భక్తుడు ఎక్కడకు వెళ్ళినా దూడవెంట ఆవులా, తనయుని వెంట తల్లిలా కూడానే వుంటుంటారు, బాబా. ఆదరంతో సాకు తుంటారు. ఆయనను నమ్మినవారికి, తిండికి, డబ్బుకు, జీవితానికే కొరత వుండదు, అనుట త్రికాల సత్యం. నిత్యం భక్తులకు అనుభవ వేద్యము.

శ్రీ సాయీశ్వరుడు సోదరభక్తుల నేదోరీతి నొకంచో జేర్చి సం రక్షిస్తూవుంటారు, శ్రీ వై సురేంద్రనాధ్‌గారు శ్రీసాయీబాబా ప్రియతమ భక్తులు. నాపై అధికారులుగ వుండి నన్ను కంటికి రెప్పవలె కాపాడు చుండుటయు శ్రీసాయీనాధుని కృపవల్లనే!

1956లో శ్రీ సురేంద్రనాధ్‌గారి మేనకోడలు రోగగ్రస్తురాలైంది. డాక్టరుకు చూపిస్తే క్షయవ్యాధి బాగుగా ముదిరినదని ఒక ఊపిరితిత్తు పూర్తిగా దెబ్బతిన్నదని, యిక నయము కాదనిచెప్పారు. శ్రీ సురేంద్రనాధ్ గారు బాధపడి "బాబా! నీవేదిక్కు' మాఅక్కకూతుర్ని నీమీద భారం వేసి పెంచుతున్నాను. ఈమెను నీవేరక్షించవలె. నాకు నీవే శరణ్యం"అ మనసారా ప్రార్థించి, మర్నాడు డాక్టరువద్దకు తీసుకువెళ్ళి ఎక్సరే తీయిం చగా బలహీనతకంటె మరేవ్యాధి కనుపించలేదు. ఆమె యిప్పుడు సం తానవంతురాలై సుఖసంతోషములతో బాబాసేవ చేస్తూవుంది.

శ్రీ సురేంద్రనాథ్‌గారికి 1971లో పెద్దగాజబ్బుచేసింది. హార్ట్‌వీక్ నెస్, రక్తపోటు అధికమై ఆసుపత్రిలో చేర్చారు. బాబాను ప్రార్థించారు యింటిలోనివారంతా! వారిమొర ఆలకించారు బాబా! ఆ సాయంత్రానికి అన్నీ తగ్గి క్షేమంగా యింటికి తిరిగి వచ్చారు ఇవి ప్రత్యక్ష నిదర్శనములు.

1960లో కాకతాళీయంగా పూజ్యులు పితృసమానులు శ్రీ బొపట్ల హనుమంతరావుగారు వ్రాసిన "శ్రీసాయి కరుణ" అనే పుస్తకం చూచుట తటస్థించి 'నేను సాయి భక్తుడను' అని వ్రాసినదే తడవుగా నాయందు అత్యంత ఆదరాభిమానములుంచి ఒక ప్రతి నాకు పంపించారు. అప్పటి నుండివారితో ముఖపరిచయం లేకుండానే చాలాకాలం ఉత్తర ప్రత్యుత్తర ములతో వారికి సన్నిహితుడిని ప్రేమ పాత్రుడినయ్యాను. ఒకసారి శ్రీ హనుమంతరావుగారు (స్వర్గస్థులైన పిమ్మట) వారిపేర్న ఉత్తరం వ్రాశాను. వారు బాబాలో ఐక్యమయ్యారని వారి పుత్రులు, ప్రచురణకర్త, సోదరులు అయిన శ్రీ వేంకట పార్థసారథిగారు వ్రాయుటతో ఖిన్నుడి నయాను. విచిత్రం ఏమిటంటే బాబా తన భక్తులను ఒకరి నొకరిని దగ్గరకు చేరుస్తారు కదా! "ఒరేయ్-బేటా! శ్రీ వేంకట పార్థసారథిగారు నీకు సోదరసమానులు. వారితోనే పరిచయం పెంచుకో," అని ఆయనను దగరకు చేర్చాడు.

నేను చిన్న నాటక రచయితను, బొత్తిగా ఆధ్యాత్మిక విషయములు తెలియనివాడను. అట్టి నన్ను సోదర సాయిభక్తులు శ్రీ బొపట్ల వేంకట పార్థసారథిగారు నాయందు అమితవాత్సల్యంతో యీపుస్తక ప్రచురణ సంద ర్భములో శ్రీసాయిబాబా ఆదేశానుసారం అభిప్రాయము, బాబాతో నాకు చిరకాలము వున్న అనుబంధపూర్వక, అనుభవపూరిత సందేశముతో తొలి

పలుకు వ్రాసి పంపమని అనుజ్ఞనిడినాడు. ఇదికేవలం శ్రీసాయీ నాధుని లీలానాటక సూత్రధారణ. అట్టిమహనీయుని గురించి తొలిపలుకువ్రాయుట వలన నాజన్మచరితార్థమైనది.

శ్రీ సాయీనాధ మహరాజ్‌కీ జై

ఇట్లు

శ్రీ సాయీనాధ పాదరేణువు
తాతపూడి బ్రహ్మానందశాస్త్రి
15–5–1979
భీమవరం

శ్రీ సాయీ సదనం
సీతారాంబాగ్
హైదరాబాదు
500 006



శ్రీ సాయినాథాయ నమః

# విజ్ఞప్తి

సోదరీ సోదర సాయీ భక్తులారా!

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు దేవుడగు శ్రీసాయీ ప్రభుని కరుణవలన, పూజ్యుల ఆశీః ప్రభావము వలన, మీ అందఱ సహాయ సంపత్తితోను "శ్రీసాయీ ప్రసన్న" "శ్రీషిర్డి సంస్థాన పండిత" బిరుదాంకితులు, పూజ్యులు కీర్తిశేషులు నగు మాతండ్రి శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు రచించిన "శ్రీ సాయిబాబా కూడ దేవుడేనా? వున్నదేవుళ్ళు చాలకనా?" (సందేహ నివృత్తి) అను గ్రంథమునకు తృతీయ ముద్రణము మీ కందించు భాగ్యము నాకు కలిగినది.

మా తండ్రిగారి బాల్యమిత్రులగు కీ. శే. శ్రీ దుర్భా శేషాద్రిగారి కోరికపై వారిపుత్రులు ధనసహాయముచేయ 1960 లో ప్రథమముగ ఈ గ్రంథమును మా తండ్రిగారు ప్రచురపరిచిరి. 1968 లో అఖిలభారత సాయీ సమాజము మైలాపూరువారు ద్వితీయ ప్రచురణము మా తండ్రిగారి అనుమతితో వెలువరించిరి, ప్రథమ ముద్రణలోని కీ. శే, శ్రీ దుర్భా శేషాద్రిగారిని గురించి (మిత్రస్మృతి) మా తండ్రి రచించిన పద్యములు; శ్రీ బండా ఆదినారాయణగారి ప్రశంస; శ్రీ సుసర్ల రామమూర్తిగారి "తొలిపలుకు" కూడ యిందు యథాతథముగ చేర్చితిని.

మెదక్‌జిల్లా కామకుంటలో ఉపాధ్యాయవృత్తి యందుండి శ్రీ సాయీ ప్రభునియం దపారభక్తితో మా తండ్రిగారి రచనలను ముద్రించుటకు నిర్విరామకృషి జరుపుచు, విరాళములు సేకరించుచు సహకరించుచున్న చి. శ్రీ S. సీనయ్యగారిని, వీరి వంశమును శ్రీసాయీ ప్రభువు సర్వదా సర్వథా కాపాడుగాక! వీరు, వీరి సతీమణి అ॥ సౌ॥ సరస్వతిగల చిత్తరువు, శ్రీసాయీ ప్రభువు వీరిపై పలికించిన 2 పద్యములు వేరుగ ప్రకటించి కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాను.

శ్రీసాయీ ప్రభుని ప్రేరణతో యీ ముద్రణకు "తొలిపలుకు" స్వానుభవపూర్వక భక్తివిశ్వాసముల ప్రకటించి వ్రాసిన చి॥ శ్రీ తాతపూడి బ్రహ్మానందశాస్త్రిని, వీరి వంశమును శ్రీ సాయీశ్వరుడు సుఖసంతోషములను ఆయురారోగ్య ఐశ్వర్యముల ననుగ్రహించి కాపాడగలరని నా ఆశ.

శ్రీసాయీ ప్రభువు మిమ్ముల నందరను ప్రేరేపించి మీ ప్రేమౌదార్యములే నా శక్తి సామర్థ్యములుగ నియోగించి ఈ కృషి నావల్ల జరిపించుచుండెనే కాని నా యందెట్టి అధిక్యతయు లేదని మీ అందరకు విన్నవించుకొనుచున్నాను. మీ ప్రోత్సాహముతో 1979 ముద్రణచేయ తలపెట్టిన "శ్రీసాయీ కబీరు సూక్తులు", "శ్రీసాయీ సుభాషితములు", "శ్రీసాయీ స్మరణ" కలిపి ఒకే పుస్తకముగ వెలువడచేయుటకు శ్రీ సాయీ నాధుడు కటాక్షించునని, మీరెల్లరు యిందుకు తోడ్పడగలరని నా విశ్వాసము: సోదరభక్తులు "శ్రీసాయీ నిలయము" నుండి తెప్పించుకొను గ్రంధములకు ప్రతిఫలముగ భక్తితో పంపు పైకమును ప్రకటించి పోషకులుగ చేర్చితిని. శ్రీసాయీనాధుడు భక్తులవద్ద నుండి వచ్చిన విరాళములతో గ్రంధ ముద్రణకును, తపాలాఖర్చులకేగాని అన్యవిధముగ వ్యయపర్చుటకు అనుమతించలేదు. కనుక శ్రీ సాయీబాబా భక్తులెల్లరు నా కృషిని గమనించి మా తండ్రిగారి రచనల నన్నియు వెలువడఁజేసి నన్ను కృతార్థుని చేయగలరని మిమ్మెల్లరను కృపజూపి ఆయురారోగ్య భోగభాగ్యముల ప్రసాదించి కాపాడఁగోరి శ్రీసాయీనాధుని హృదయపూర్వకముగ ప్రార్థించుచున్నాను.

శ్రీసాయీ నిలయమ్<br>చెరువు<br>1-8-1979

ఇట్లు విన్నవించు<br>శ్రీసాయీ భక్తపాదరేణువు<br>బాపట్ల వేంకటపార్థసారధి

# పోషకావళి

| | రూ. |
|---|---|
| చి॥ శ్రీ B. V. సుబ్రహ్మణ్యసాయి. M. Tech. Structural Engineer కోయంబత్తూరు, | 100-00 |
| శ్రీ B. C. కృష్ణమూర్తి. రాధాకృష్ణనగర్. కడప. | 100-00 |
| శ్రీ R. రంగనాథన్, BA. BL. Advocate : కడప. | 65-00 |
| శ్రీ మాదిరాజు పార్థసారథి. గుంటూరు | 58-00 |
| శ్రీ K. ప్రసాదరావు. 'మాతృశ్రీ' హైదరాబాదు. | 58-00 |
| శ్రీమతి బూదరాజు వరలక్ష్మమ్మ. హైదరాబాదు. | 58-00 |
| శ్రీ చుండూరు చంద్రమౌళీశ్వర ప్రసాదరావు తిరుమలై. | 58-00 |
| శ్రీ G. రామారావు, ఖరగ్‌పూర్ (W. B.) | 55-00 |
| శ్రీ కందుకూరి వాయునందనరావు, విజయవాడ, | 50-00 |
| శ్రీ గెల్లి సీతారామమోహన్, విజయవాడ | 50-00 |
| శ్రీ తమ్మన కృష్ణమూర్తి, విజయవాడ | 50-00 |
| శ్రీ C. M. Sahu భంజానగర్ (ఒరిస్సా) | 50-00 |
| Dr. C. P. విశ్వనాథం M. B. B. S. M. S. కర్నూలు | 50-00 |
| శ్రీ గిరిరాజు శేషగిరిరావు కరణం. గుండ్లపల్లి | 50-00 |
| శ్రీ మాధవపెద్ది లక్ష్మీనరసింహం. Agrl. Officer పెదనందిపాడు. | 45-00 |
| చి॥ శ్రీ B. V. రమణన్, భీముని పట్నం | 35-00 |
| చి॥ శ్రీ S. చంద్రశేఖర్. విజయవాడ | 32-00 |
| చి॥ శ్రీ బాపట్ల రాజశేఖరసాయి విజయవాడ | 30-00 |
| శ్రీ V. భరతుడు. J. E. వేమూరు | 30-00 |
| శ్రీ N. వేణుగోపాల్. హైదరాబాదు | 30-00 |

| | రు. |
|---|---|
| శ్రీ రెడ్డిరామమోహనరావు. నిడుదవోలు | 30-00 |
| శ్రీ G. భీమరాజు A. E. విజయవాడ | 29-00 |
| శ్రీ C. విశ్వావధానులు. అనవర్తి | 25-00 |
| శ్రీ ముల్పూరి సుబ్బారావు. మాధవరం | 25-00 |
| శ్రీ S. శివకుమార్. రాజమండ్రి | 25-00 |
| శ్రీ S. సంజీవనారాయణం. తిరుపతి | 20-00 |
| శ్రీ నిడదవోలు సత్యనారాయణ. వినాయకనగర్ | 20-00 |
| శ్రీ S. సీనయ్య, కానుకుంట. | 20-00 |
| శ్రీమతి K. సుమిత్రమ్మ | 20-00 |
| శ్రీమతి S. నాగమణెమ్మ | 20-00 |
| శ్రీ S. వెంకటస్వామి, కమలాపురం. | 15-00 |
| శ్రీమతి దేవకమ్మ, బెంగుళూరు. | 15-00 |
| శ్రీ B. లక్ష్మీపతి, తాడిమళ్ళ. | 15-00 |
| చి॥ శ్రీ C. బాలకృష్ణ, A,S,M. చంద్రపురి. | 15-00 |
| శ్రీ శాస్త్రి సూర్యనారాయణ, జాలిపూడి. | 12-00 |
| శ్రీమతి D. సూర్యకాంతమ్మ, సాలేపువారిపాలెం. | 12-00 |
| శ్రీ G. రామకృష్ణ, కొవ్వలి. | 12-00 |
| శ్రీ G. రాజగోపాల్, మదనపల్లి. | 12-00 |
| శ్రీ T. రామచంద్రయ్య, ప్రొద్దుటూరు. | 12-00 |
| శ్రీ P. సుబ్బారావు, సికిందరాబాదు. | 12-00 |
| శ్రీ A. V. సుబ్బారావు, do | 12-00 |
| శ్రీ శాస్త్రుల దశరధరామశర్మ, కానుకుంట. | 12-00 |
| శ్రీ దుగ్గి వీరప్ప, B. O. L. do | 12-00 |

| | రూ. |
|---|---|
| శ్రీ దేవ నారాయణగుప్త, కానుకుంట | 12–00 |
| శ్రీ సూరాపురం లక్ష్మీనారాయణ do | 12–00 |
| శ్రీ శాస్త్రుల రఘురామశర్మ, M. A. గోమారము | 12–00 |
| శ్రీ సురాపురం నర్సింగరావు, సికిందరాబాదు. | 12–00 |
| శ్రీ గోమారపు చంద్రశేఖర్, do | 12–00 |
| శ్రీ తాళ్ళపల్లి రాజయ్యగుప్త, కానుకుంట. | 10–00 |
| శ్రీ P. రామకృష్ణయ్య, ఖరగ్‌పూర్. (W. B.) | 10–00 |
| చి॥ శ్రీ కోడూరి వెంకటసుబ్రహ్మణ్యశర్మ, కబ్బళ. | 10–00 |
| చి॥ శ్రీ సావడి సుబ్బారావు, నందితవారె. | 10–00 |
| శ్రీ మాతంశెట్టి సుదర్శనరావు, నెహ్రూనగర్. | 10–00 |
| శ్రీ V. వెంకయ్యశర్మ, మచిలీపట్నం. | 10–00 |
| శ్రీ J. వెంకటేశ్వరరావు, క్రొవ్విడి, | 10–00 |
| కుమారి A. నిర్మల, హుజూర్‌నగర్, | 10–00 |
| శ్రీ C. రఘురామయ్య, నందికొట్కూరు. | 10–00 |
| శ్రీ ఆదిపూడి మోహనరావు, గుంటూరు. | 10–00 |
| శ్రీ M. S. నాయుడు, తిరుపతి | 10–00 |
| శ్రీ కోక లక్ష్మణరావు, హైదరాబాదు. | 10–00 |
| చి॥ శ్రీ K. రంగారెడ్డి, కందివలస, | 5 –00 |
| శ్రీ K. A. సదాశివరావు, B.Sc., B.Ed. గుమ్మడదల | 5 –00 |
| శ్రీ G. V. రమణ, ఖరగ్‌పూర్. (W. B.) | 5 –00 |
| శ్రీ A. నారాయణరావు ,, | 5 –00 |
| శ్రీ K. A. రాములు, నల్లాయపల్లి. | 2 –00 |

# శ్రీ సాయీబాబా



సత్యవచనంబు, సహనంబు, శాంతి, దాంతి
సర్వ భూత హితంబు, నిస్స్వార్థపరత,
సత్య సంపద, ప్రియసూక్తి, సాధుసేవ,
సతముఁ జేకూర్పఁగదవె; శ్రీ సాయిదేవ!

## చి. శ్రీ. సీనయ్య, వీరి సతీమణి చి. సౌ. సరస్వతి



పుడమి "శ్రీ పరాంకుశ" వంశభూషణుండు
'రాములమ్మ, గోపయ' ల గారాబు సుతుఁడు;
సతి 'సరస్వతి'ఁగూడి శ్రీసాయిసేవ
సలుపు నిత్యంబు "సీనయ్య" సఖుడితండు!

'కానుకుంట' నివాసి! సత్కార్మశీలి!
పాఠశాలనుపాధ్యాయ పదవియందు
'స్వర్ణపతకంబు' గ్రహియించి వాసిఁగాంచె
కరుణ నితని వంశముఁ బ్రోవగదవె! సాయి!

# విషయసూచిక

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః



సకల ధర్మములను చక్కగ త్యజియించి
శరణు గనుము నన్నె సర్వగతుల;
నిన్ను నిఖిల పాప నిర్ముక్తుఁ గావింతుఁ
చింత విడుము బిడ్డ! స్వాంతమందు

(శ్రీమద్భగవద్గీతామృతము: ౧౮-౬౬)

ఓమ్

శ్రీ సాయీప్రసన్నః

# ప్రార్థన

సాకారుండవో? లేక, ని
రాకారుఁడవో? మఱేమియగుదువో తెలియఁగన్
నాకు ఋజు? శిష్యుఁడ, జడుఁడను
సాకవె! నీ కరుణఁబఱపి సాయీనాథా!

సందేహము లడఁచవె! నీ
యందున నేకాంతభక్తి నందింపవె! ని
న్నెం దేమఱ నీకవె! యీవు
సందేహము లడఁచఁగదవె! సాయీనాథా!

చేయఁదగని పనులఁ జేసితి నెన్నియో
చేయఁదగినవానిఁ జేయనైతిఁ;
గృపణుఁడైన నాకు నీకె వేఱుగతి లేదు,
కరుణఁబఱపి ప్రోవఁగదవె! సాయి!

ఓమ్

శ్రీ సాయీ సమర్థ

# మిత్రస్మృతి

భవపాదాంబుజ భక్తి తత్పరత సద్వంశోన్నతిన్ గంటి, బాంధవ మిత్ర ప్రకర ప్రశంసలకుఁ బాత్రంబైతి, సద్వ్యవహారి! వికార్యబ్దిఁ బవిత్రమైన శివరాత్రిన్ నేత్రముల్ మూసి శ్రీ శివసాయుజ్యము నొందితే! ప్రియసఖా! శేషాద్రి! భద్రార్థివై.

కౌండిన్య గోత్రోద్భవుండు దుర్భా వంశ
లక్ష్మీనృసింహాఖ్యుఁడే లలితు తాత,
కన, సుబ్బరాయ వేంకన్నలు నే సుహృ
ద్భావునకు జనక దత్త పితలు,
వేంకట నరసింహ వేంకట రమణులే
హితు నన్నదమ్ములై ప్రతిభగంద్రు
బాలకృష్ణుండు సుబ్రహ్మణ్యుఁ డన్న పూ
ర్ణమ్మయు వేంకట రత్నమాంబ

లే సుకృతు బిడ్డ, ఎవని సన్యాసమాంబ
కనిరో, నన్నపూర్ణమ పెంచుకొనిరో, రామ
లక్ష్మి చేపట్టె, నట్టి బాల్యసఖుఁ గీర్తి
శేషు శేషాద్రి కచ్యుతస్థితి నొసంగి
శరణ మీఁగదే! శ్రీ శేషశాయి! శాయి!

— • —

# ఓమ్

## శ్రీ సాయినాథాయనమః

## తొలిపలుకు

'శ్రీ సాయిబాబా బాకూడా దేవుడేనా?' అను నామాంకితమైన యీ గ్రంథమునకు బరిచయవాక్యము వ్రాయు భాగ్యము నాకు బ్రసాదించినందులకు నామిత్రుడగు శ్రీ బాపట్ల హనుమంతరావుగారి కత్యంత కృతజ్ఞుడను. ఈ గ్రంథమును సాంతముగా జదివిన యనంతరమిది నావంటి కించిద్జ్ఞునకు గానిపని యనిపించినది. 'మందః కవియశఃప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్' అను వాక్యము ప్రతిధ్వనించి, శంకాకలితునొనర్చినది. భగవద్గీతాది గ్రంథములనుండి ప్రమాణ వాక్యములు సందర్భానుసారముగ నుదహరింపబడినవి వీని యందు బ్రవేశములేని యీ యల్పజ్ఞునకు నీ ప్రమాణముల యౌచిత్యమును గ్రహించుశక్తి యసాధ్యము. అయినను కృతిపతియగు శ్రీ సాయిప్రభువే పలుకు పలుకులు పలికింపగ గలడను విశ్వాసముతో నీ సాహసకార్యమున కుపక్రమించితిని.

దైవాంశసంభూతుడును, ప్రేమస్వరూపుడైన శ్రీ సాయిబాబా సచ్చరిత్రము సర్వజన సమ్మతము. ఈ నిష్కామ కర్మయోగి పతితజనానీకము నుద్ధరింప నవతరించిన సర్వవ్యాపియగు సచ్చిదానంద స్వరూపుడు ధర్మచ్యుతిగాని, యధర్మ ప్రాబల్యముగాని కలుగనున్నతఱి నట్టి మహనీయులుదయించుటయు, ధర్మసంస్థాపనాది కార్యానంతరమున నదృశ్యులగుటయు దరువాత దేశకాలపాత్ర వైరుధ్యముల చేతను- పూజావిధాన వైవిధ్యములచేతను నామాంతరముల వివిధరూపములఁ బూజింపబడుట మనము గనుచున్నారము.

శ్రీ రమణమహర్షి, బ్రహ్మానంద, ఉపాసనీబాబా మున్నగు యోగివర్యుల చరిత్రము లిందులకుఁ దార్కాణములు.

శ్రీ సాయిబాబా చరిత్ర మితరచరిత్రలకంటె మిన్నయై భక్తానీకము ననేకవిధముల నాకర్షించినది. నా యెఱిఁగినమేరకు దక్షిణదేశమున - ఆంధ్రదేశమునను - మహారాష్ట్రమునను శ్రీ సాయీ మందిరములు సుప్రతిష్ఠితము లైనవి. నిత్యధూపదీప నైవేద్యాద్యుపచారములచేఁ బూజింపఁబడుచు శ్రీసాయీ నాథుఁడు భక్త హృదయములలో నిత్యనివాస మేర్పఱచుకొన్నాఁడు.

శ్రీ బాబా పవిత్రత, ఔన్నత్యము, సర్వభూత దయాళుత్వము నిరూపించుటకు గ్రంథకర్త తన కూలంకష ప్రజ్ఞావిశేషముఁ బ్రదర్శించి సప్రమాణముగ, సహేతుకముగ శ్రీసాయీ పరతత్త్వమునుదృఢీకృత మొనర్చినందుల కెంతయుఁ బ్రశంసార్హుఁడు "కష్టనివారణము-అభీష్టసిద్ధియే ప్రతివ్యక్తియుఁ గోరునది......బాబాపాదముల మ్రోల నెల్లరు వానిని సంపాదింపగలరు" (64వ పుటఁజూడుఁడు) గ్రంథకర్తగారి పై వాక్యములు నిత్యసత్యములు. శ్రీ సాయీ కుదరతు లత్యంత మాదరింపఁదగినదీ కృతి. గ్రంథమున నుదాహరింపఁబడిన ప్రమాణముల యౌచిత్యమును, విషయ పరిశీలనాప్రజ్ఞయును పాఠకులు భిన్నమతానుయాయు లైనను వారియందుఁ బరివర్తనము తేఁగలవని విశ్వసించుచున్నాఁడను.

శ్రీ సాయీబాబా సాహిత్యమునందు నిర్విరామ కృషి యొనర్చి, అపార ప్రజ్ఞయు - అచంచల భక్తి విశ్వాసములును గ్రంథకర్త ప్రదర్శించిరనుటకుఁ దదితర రచనలగు "శ్రీసాయీ మననము" - "శ్రీసాయీకరుణ" ప్రబల సాక్ష్యములు.

ఈగ్రంథ పఠనము బాబాయందలి భక్తి లేశమును ప్రగాఢమొనర్ప సమర్థమై యున్నందున ఉత్సాహముగలవారిద్దానిని దప్పక చదివి శ్రీసాయీకరుణకుఁ బాత్రులయ్యెదరని నాపరమ విశ్వాసము.

అమూల్యములగు శ్రీ సాయిబాబా మాహాత్మ్యములఁ దెలుపు సాహిత్యగ్రంథము లనేకము లింకను అముద్రితములుగా నున్నవి. సోదర భక్తబృందము తగు చేయుతనిచ్చి, యీ నిక్షేపములను ప్రకటితములొనర్చుకొని శ్రీ సాయీ ప్రభువు దయారస మాస్వాదించి తరించి, ధన్యులు కాఁగలరని కోరుచున్నాఁడను.

జీవిత రంగమునందుఁ బ్రతిక్షణము భయభ్రాంతమై యనిశ్చితమై యున్నది. రానున్న కాలమున అనుకూల వాతావరణము మృగ్యముగానుండునట్లు తోఁచుచున్నందున ప్రతి వ్యక్తియుఁ గష్టములను దూరమొనర్చుకొనుటకు నిర్విరామ కృషి నొనర్పవలసియున్నది. పురుషప్రయత్నమునకుఁ దోడు దైవబల మత్యవసరముగదా! అయ్యది యిష్టదేవతారాధనమునఁ గాఁగలదు. శ్రీసాయీయవతారమున ముఖ్యకర్తవ్యమే అది. కావున పాఠకమహాశయు లీఅవతారపురుషుని అనుగ్రహమునకు పాత్రత సంపాదించుకొని ధన్యులగుటకుఁ దగు నుత్సాహమును శ్రీసాయీబాబా ప్రసాదించుగాతమని ప్రార్థన.

సత్యనారాయణపురము
విజయవాడ.
14-12-1960

భక్తజన విధేయుఁడు
సుసర్ల రామమూర్తి

# విజ్ఞప్తి

భక్తజనులారా!

"శ్రీసాయిబాబా కూడ దేవుఁడేనా? ఉన్న దేవుళ్ళు చాలకనా?" అను నామిత్రుని ప్రశ్నమునకు సమాధానముగ ఈ చిన్నకృతిని సాయిప్రభువు పలికించినవిధమునఁ బలికి సోదరభక్తుల కందించుకొను భాగ్యము కలిగినది.

చీరాలనుండి వెలువడిన "సాయిలీల" అనుమాసపత్రిక యందు 1953 సంవత్సరమునందు, మైలాపూరు - మద్రాసు నుండి వెలువడుచున్న "సాయిసుధ" అను మాసపత్రికయందు 1957, 58 సంవత్సరములందును ఈవిషయమునుగూర్చి వ్రాసి యుంటిని. సోదరభక్తులు ప్రత్యేకముగ నొకగ్రంథరూపమునఁ బ్రచురింపుమని కోరినందున లోఁగడ వ్రాసిన వ్యాసములఁ గొన్నిమార్పులు- చేర్పులతో నీకృతిని బాబా ప్రచురింపించుకొనినాఁడు. అంతయు ఆతండ్రిలీల!

దైవము- అవతారములు- తదభిన్నులగు సాధువరులఁ గూర్చి వివరించుటకు నాయట్టి స్వల్పుఁడు అర్హుఁడుఁ గాఁడు. అట్టివస్తువును వివరించుటకు వివరించువాఁడట్టివస్తువు కావలయును. నాయట్టి స్వల్పుఁడేమి పలికినను అది అసంపూర్ణమే యగును. స్థూలదృష్టికి గోచరించునేవియో కొన్నివిషయములు మాత్రమగుచున్నవి. అట్టి "సత్యవస్తువు" స్వానుభవైకవేద్యముగఁ గాని, పలుకులకుఁ దలంపులకుఁ నందదు. కారణ కార్య హేతువా పరాత్పరుఁడే. ప్రశ్న నడిగించువాఁడు- పలుకుమని ప్రేరేపించిసమాధానము పలికించువాఁడు- శ్రీసాయిప్రభువే ఆతండ్రి ఆశ్రయమును- అభినవ నానాసాహెబ్ చందోర్కరు శ్రీ సాయివ్యాసుఁడు - పరమసాధువు- పూజ్యపాదుఁడగు

శ్రీ బి. వి. నరసింహస్వామిగారి అమోఘాశీః ప్రభావము అర్హతకు మూలమని మనస్సున నిశ్చయించుకొని యీకృతిఁ బలుకఁ సాహసించితిని. నా సాహసమును విజ్ఞులు మన్నింతురు గాక !

## ఈ కృతి నాలుగంశములుగ విభజింపబడినది.

ప్రథమాంశము :-

"ఉన్న దేవుళ్ళు చాలకనా?" అను రెండవ ప్రశ్నమునకు సమాధానముగ "దేవుఁడు" అని చెప్పఁబడువాఁడు పలువురు లేరనియు, సర్వజ్ఞత్వ- సర్వనియంతృత్వ - సర్వవ్యాపకత్వములు గలిగి, నిరాకార నిరంజనుఁడగు దేవుఁ డొక్కఁడే యనియు నిందు నిరూపింపఁబడినది.

ప్రపంచమునం గల మతములన్నిటికంటె మన హైందవ సనాతనమతము విశాల హృదయాశయములుగలది. జీవకోటి యందుత్తమ జన్ములైన మానవులు ఆస్తిక్యబుద్ధి- దేవుఁడు న్నాఁడు-అను బుద్ధిఁగలిగి, యే 'నామ-రూపము' ల ఆ దేవుని ధ్యానించి సేవించినను సమానఫలము కలుగునని ప్రతిపాదించిన మతము-మన హైందవ సనాతనమతము. శ్రీశంకరభగవత్పాదులకు 'షణ్మత స్థాపనాచార్యుఁడ'ను బిరుదు గలదు. శైవ- వైష్ణవ- శాక్తేయాది మతములన్నియు వేద సమ్మత మతములనియు, నేరూపమున ఆ దైవమును సేవించినను ఫలము సమానము-అను సత్యమును ఆదిశంకరుఁడు బోధించినాఁడు. ఇవియే కాక ప్రపంచమునం గల వివిధమతములతో హైందవ సనాతన మతమేనాఁడును స్పర్ధించలేదు. అన్నిట సమాన ప్రేమాదరణములు ప్రదర్శించి తనలో నిముడ్చుకొనఁజాలినది. కావుననే యీనాటి కేనాటికైన నిలువ సమర్థమైయున్నది.

ఆంగ్లేయులలో విజ్ఞాన సంపన్నులగు మాక్సుముల్లర్, జార్జి బెర్నార్డ్‌షా మొదలగువారు మన హైందవ సనాతన మతమును వేనోళ్ళఁగొనియాడిరి. జార్జి బెర్నార్డ్‌షాగారు పలికిన పలుకులు గమనింపుఁడు:-

"The apparent multiplication of gods is bewildering at first glance, but you soon discover that they are all the same God in different aspects and functions. There is always one uttermost God who defies personification. This makes Hinduism the most tolerent religion in the world, because its own transcendent God includes all possible Gods."

"తొలుత స్థూలదృష్టికి పలువురు దైవములవలె గోచరించుచు చీకాకు గలిగించునుగాని, సావధానముగఁ బరిశీలించిన నవియన్నియు తత్తత్క్రియోచిత నామరూపములుగల ఒకే 'దైవము'- అవి, పరిస్ఫుటమగును. నామరూపముల కతీతమైన పరాత్పరుఁడు- 'దేవుఁడు' కేవలము ఒక్కఁడుమాత్రమే కలఁడు. హైందవమతమున దేశకాల భావనాతీతమైన 'దైవము' నందు సకలదైవతములు ఇమిడియున్న కారణమున హైందవ మతము ప్రపంచమునఁ గల మతములన్నిటికంటెను మహోన్నతోదారాశయములు గల మతమై యున్నది."

(జార్జిబెర్నార్డ్‌షా)

హైందవ సనాతన మతమునకు మూలాధారములైన శ్రుతి స్మృతి పురాణేతిహాసాదులందు ప్రతిపాదింపఁబడిన 'దేవుఁడు' ఒక్కఁడే- కాని, పలువురు 'దేవుళ్ళు' లేరు- అని యీ ప్రథమాంశమున నిరూపింపఁబడినది.

## ద్వితీయాంశము :-

ఇందు దైవము యొక్క సగుణరూపములు, అవతారములనుగూర్చి వివరింపఁబడినది. అవతారము- జ్ఞాని- బ్రహ్మవేత్త- వీరందఱు ప్రకటితమగు దైవాంశ గలవారగుటచే "ప్రత్యక్షదైవ" మగుచున్నారు. వీరలయందు హెచ్చుతగ్గులు లేవు. దైవమునందు ప్రతిపాదింపఁబడిన శక్తిసంపదలెందెందు గలిగినను అది "దైవమే" యగును. భక్తుని ప్రేమోత్కంఠతలచే నిరాకారుఁడగు 'దేవుఁడు' సాకారుఁడగుచున్నాఁడు. అది యొక దేశమున- ఒక కాలముననే కాక యెల్లెడల నెల్లకాలముల నెప్పు డెప్పుడవసరమని తోచునో అప్పుడపుడే దేవుఁడు సాకారుఁడై తనబిడ్డల ననుగ్రహించు చున్నాఁడు. ఈ భాగమున దైవము "సాయీబాబా" రూపమున ప్రకటమగుటకుఁ గల కారణములు తెలుపఁబడినవి.

దశావతారములని చెప్పఁబడు మత్స్య కూర్మనృసింహాద్యవతారములు- కపిల దత్తాత్రేయాద్యవతారములు-గౌతమ బుద్ధ శ్రీరామకృష్ణ పరమహంసాద్యవతారములు 'శ్రీసాయీబాబా' అవతారమునకు భిన్నములుకావు. ఇంతకుఁబూర్వము కొందఱు 'దేవుళ్ళు' కలరనియు'సాయీబాబా' అదివరకుఁగల 'దేవుళ్ళ'సంఖ్యకు అధికముగఁ జేర్పఁబడినాఁడని సోదరభక్తులు భ్రమపడరాదు. అద్వితీయుఁడు-అనంత లీలాద్భుత కార్యధుర్యుఁడగు భగవానుఁ డిన్నిరూపముల నవతరించినాఁడు. ఇఁకెన్నిరూపములనైన నవతరింపఁగలఁడని భక్తులు విశ్వసించుట శ్రేయము.

ఈవిశ్వమును సృజించి పోషించి లయింపఁజేయుటలు ఈశ్వరునకొకలీల. మాయాతీతుఁడగు పరమాత్మ మాయను తన అధీనముచేసికొని సృజించిన యీ విశ్వమునఁగల సకల జీవులలోఁ దా నధివసించి యీజీవులను భ్రమింపజేయుచున్నాఁడు. ఈజీవు లన్నిట నిగూఢమైయున్న ఆ సత్యవస్తువు నెఱుఁగుటయే జీవికిఁ బరమావధి. అట్టిభాగ్య మితరజీవులకంటె మానవునకు లభ్యమైనది. వీనియందు జ్ఞానమను విశేష భాగ్యముకలదు. అట్టిజ్ఞానమును వినియోగించి సర్వాంతర్యామి యగు నీశ్వరునిఁ దెలిసికొని ఆవస్తువును బొందుటే 'జీవితపరమ ఫలము'. ఈ విశ్వనాటకమున ప్రాణులు మాయకులోఁగి సత్యవస్తువును త్రోసిరాజని అసత్యము లసుఖములైన లౌకికపదార్థములకై పఱుగువాఱుచున్నవి.

'అనిత్య మసుఖంలోక మిమంప్రాప్య భజస్వమామ్'
'కాన, నసుఖమనిత్యలోకంబుఁ బొందియున్న నీవు భజింపుమినన్ను సతము'

(భగవద్గీతామృతము 9-33)

'మా మేవ యేప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే'
"ఎట్టివారునన్నే యాశ్రయింపఁగలరో
వార లీ మాయను దరింత్రు పాండుతనయ!"

(భగవద్గీతామృతము 7-14)

'మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః'
'స్వాంతముంచుమి నాయందు భక్తిఁగనుమి
నను యజింపుమి, నాకు వందనములిడుమి;
ఇట్లు మత్పరాయణుఁడవై యెపుడు మనసు
నిలిపి నాయందు, నన్నుఁబొందఁగలవు పార్థ!'

(భగవద్గీతామృతము 9-34

'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణంవ్రజ
అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః'

"సకల ధర్మములను ద్యజియించి, నను మాత్ర
మీవు శరణు గనుము; యేను నిన్నుఁ
బాండవేయ! సకల పాప విముక్తుఁ గా
వింతు నిజము; దుఃఖ మొందకయ్య!"

(భగవద్గీతామృతము 18–66)

అని కరుణామయుఁడగు భగవానుఁడు శ్రీకృష్ణరూపమున భగవద్గీతలందు తనబిడ్డలకు తన్ను జేరు మార్గమును బోధించినాఁడు.

"దుర్లభం త్రయ మే వైతత్ దైవానుగ్రహ హేతుకం
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయమ్"

అని శ్రీ శంకర భగవత్పాదులు పలికినాఁడు. జన్మములన్నిట మనుష్యజన్మము దుర్లభము. అదికలిగినను జనన మరణ చక్ర భ్రమణమునుండి విడివడుటకై – ముక్తికై – ప్రయత్నించుట అంతకంటె దుర్లభము. ఈవిముక్తికి ఉపాయోపేయములైన మహాపురుష సంశ్రయమత్యంతదుర్లభము. అనేకజన్మ సుకృత పరిపాకమునఁజేసి జీవికి సాధు సజ్జనసాంగత్యము లభించును. అది లభించెనా–ఆజీవి ప్రవృత్తి మార్గమునుండి మరలి నివృత్తి మార్గమున గమనింప మొదలిడును. కాని విముక్తి ఒక్క జన్మమున లభ్యమగునదికాదు.

"బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః"

"పెక్కుజన్మంబులెత్తిన పిదప జ్ఞాన
వంతుఁడై "యీ సమస్తము వాసుదేవుఁ
డొక్కఁడే" యంచు నరసి, నన్నొందఁగలుగు
నామహాత్ముఁడు దుర్లభుఁ డనఘచరిత!"

(భగవద్గీతామృతము 7–19)

ప్రత్యక్షదైవమగు సమర్థ సద్గురువు నాశ్రయించినను బహుజన్మ వాసనాకళంకితమగు జీవికి "చిత్తశుద్ధి"ఒక్క జన్మమున నే ప్రాప్తించదు. కాని, ఒక్కపరి సమాశ్రయించిన జీవిని ఆ సద్గురురూపుడైన దైవము విడిచిపెట్టడు. ఎన్ని జన్మలకైన వెంటనుండి తనవానిని గాపాడుచునేయుండును.

i నానాసాహెబ్ చందోర్కరును బాబా స్వయముగ పిలిపించెను. తన్ను బిలిపించిన కారణమేమని చందోర్కరు ప్రశ్నింపగా "నానా! నేనందఱను పిలువనంపుదునా? నీతో నాలుగుజన్మలనుండి నాకు సంబంధముకలదు." అని సాయీ ప్రభువు సమాధానమిచ్చెను.

ii జస్టిస్.M. B. రేగే బాబాను బిడ్డవలె ఆశ్రయించినవాడు. ఆభక్తునితో మాటాడుచు "బిడ్డా! నీవు ఏమికోరిన దాని నిచ్చుటకు సిద్ధముగనున్నాడను. కోరుకొమ్ము." అని బాబా పలుక, తనకేమియువలదని 'రేగే' బదులుచెప్పెను. కాని, బాబా ఏదేని కోరుకొనుమని బలవంతపెట్టెను. "బాబా! "నీకుగలుగనున్న జన్మజన్మములందు నిన్నువిడువను" - అని వరమిమ్ము," అని, 'రేగే' కోరెను. అంతట సాయీనాథుడు "బిడ్డా! యిప్పటికి పదివేల సంవత్సరములనుండి నిన్ను విడనాడి యెఱుగను. ఇక మీదటను విడువను. అని అభయమిచ్చెను.

iii శ్యామాను (మాధవరావుదేశపాండ్యేను) బాబా ఒకపరి బుగ్గపట్టుకొని మెలియపెట్టెను. శ్యామా కొంచెము కోపము కలిగినట్లు కనబడెను. అంత బాబా "72 జన్మల నుండి నిన్ను తాకియెఱుగను. ఇప్పుడు బుగ్గ మెలియపెట్టిన మాత్రమున కోపమువచ్చినదా?" అని ప్రశ్నించెను.

iv ప్రొఫెసర్. జి. జి. నార్కేను-శ్రీసాయిప్రభువు నకు 'శ్యామా' ఎఱుకపఱుపఁగా "ఏమీా, నీ వీతని నాకెఱుక పఱచుచున్నావా? ముప్పది జన్మములనుండి నేనీతని నెఱుఁగు దును." అని బాబాపలికెను.

ఇట్టిఘట్టములు పెక్కులుగలవు. ఈవిషయములఁగూర్చి పలువురకు సందేహములు కలుగవచ్చును. పునర్జన్మములఁ గూర్చి కొందఱు విశ్వసింపరు. శాస్త్రములందు విశ్వాసము లేని వారికెన్నివిధములఁ దెలిపినను ప్రయోజనములేదు.

భగవద్గీతలందు "ఈ యోగమును నేను మొదటసూర్యున కుపదేశించితిని. అతఁడు దానిని తనకుమారుఁడగు వైవస్వత మనువునకు, ఆమనువు ఇక్ష్వాకునకు దెలిపెను" అని శ్రీకృష్ణుఁడు పలుక "కృష్ణా! నీ పుట్టు విప్పుడు. సూర్యుఁడెప్పుడో పుట్టెను. అట్టియెడ నీవీ యోగము సూర్యునకుఁ దెలిపితివనిన నే నెట్లు నమ్ముదును?" అని అర్జునుఁడడిగెను. శ్రీకృష్ణుని సమాధానము గమనింపుడు :—

"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప."
నీకు నాకును బూర్వ మనేకములగు
జన్మము లతిక్రమించె నో సవ్యసాచి ।
నే నెఱుంగుదు వాని నన్నింటి నిపుడు,
నీవు వాని నెఱుఁగఁగా లేవు నిజము.

(భగవద్గీతామృతము ౪-౫)

కావున బ్రహ్మవిదునియొక్క "యెఱుక" దేశకాల పరిమితము కానిది. భూత భవిష్య ద్వర్తమానములు సకలము ప్రత్యక్షమై పఱుగు సాయినాథునకు వేద్యములు. కావున నే

తన ఆశ్రితులు - పూర్వజన్మమునందు వివిధ సాధురూప ధారియు - భగవత్స్వరూపుఁడగు తన్నాశ్రయించినవారు - ఎక్కడెక్కడఁగలరో వారినందఱఁ జేరఁబిలిచినాఁడు. వారికి హితములగు కోరికల దీర్చినాఁడు. ప్రవర్తనములు చక్కదిద్ది నాఁడు. వారి వారి సమర్థతలకొలఁది జ్ఞానపథమున ఉన్నత స్థితికిఁ గొనిపోయినాఁడు. నేటికిఁ గొనిపోవుచున్నాఁడు.

బాబా తన అంకిత సంతతికి సర్వకాల సర్వావస్థల యందుఁ దన్ను జ్ఞప్తియందుంచుకొని స్మరించి సేవించు అవ కాశములు కల్పించుచునేయుండును. తనబిడ్డలను క్షణమేని విడువఁడు. వారినిఁ జక్కదిద్దుభార మాతండ్రిదియే. బాబా బోధలలోని రహస్యము సోదరభక్తులు గ్రహింపనగును. బాబాను సర్వ భూతాంతర్యామిగ ధ్యానింపనేర్చిన భక్తుఁడు తానుస్వయముగ సర్వభూతాంతర్యామి యగుచున్నాఁడు. భాగవతమున ప్రతిపాదింపబడిన "మూలసూత్రము" - శ్రీ సాయిప్రభుబోధలలోని "సారామృతము" ఇదియొక్కటే:-

"నీనుండి యితరుల నెంతెంత దూరము చేయుదువో అంతంత కష్ట వ్యసనములకు - ఎంతెంత నీలోనికిస్వీకరించి ప్రేమపఱతువో అంతంత సుఖానందములను బొందఁగలవు. ప్రతిజీవియందు నీప్రేమను కేంద్రీక రింపనేర్చిన నీఆత్మ వృత్తముయొక్క పరిధి కంతమేదియును లేదు."

సోదరభక్తు లీ రహస్యము నేమాత్రము విస్మరింపఁదగదు. సర్వసౌలభ్య - సర్వసమర్థతలుగల అవతారము శ్రీ సాయి నాథావతారము.

## తృతీయాంశము :-

ఇందు బాబా జననము. రెండవ సంవత్సరమునుండి అయిదవ సంవత్సరము వరకు సూఫీ మతస్థుఁడగు ఫకీరుచేఁ బెంపఁబడినవిధము, ఆరవయేట సద్గురువును గోపాలరావు దేశముఖును (వేంకుశుని) సమాశ్రయించుట-పదునేడవయేట తొలిసారిగ శిర్డికిఁజేరి కొన్ని నెలలు మాత్ర ముందుండి, విడచి నచటనుండి వెళ్ళి తిరిగిఇరువదవయేట శిర్డికిఁజేరిద్వారకామాయి మసీదున సుస్థిర నివాసమేర్పఱచుకొనిన విషయములు సంక్షేపముగఁ దెలుపఁబడినవి.

బాలుఁడైనబాబా గోపాలరావుదేశముఖ్ ను (వేంకుశుని) పన్నెండు సంవత్సరములుసేవించెను. ఆ సద్గురువు నను గ్రహమున 'సాక్షాత్కారస్థితిని' బాబా పొందఁగలిగెను. కబీరు-కాశీకా రామానంద యోగులు-సాయీబాబా - గోపాలరావు దేశముఖులుగ జనించిరని చెప్పుదురు. ఇందు సందేహములేదు. భగవద్గీతా సూక్తులును ఈవిషయమును సమర్థించుచున్నవి.

"తత్రతం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికం"
అట్టితఁడు పూర్వ దైహికంబై యెసంగు
బుద్ధిసంయోగ మాతఁడు పొందుచుండు.

(భగవద్గీతామృతము ౬.౪౩)

"పూర్వాభ్యాసేన తే నైవ హ్రియతే హ్యవశోఽపి సః"
'అనఘ! పరవశుఁడై యున్న నైన నతని
బలిమి పీడ్చుఁ బురాకృతాభ్యాస బలము'

(భగవద్గీతామృతము ౬.౪౪)

అట్టి ప్రేమాత్మకమగు గురుసేవ వలన బాబా, సంపూర్ణ తత్త్వస్థితి 'సర్వభూతాత్మ-భూతాత్మస్థితి' (భగవద్గీతా ౫.౭) పొందగలిగెను.

ఈ తృతీయాంశమునందు మహాల్సాపతి శిర్డీయందు పొలిచిన పరతత్త్వమునకు 'సాయిబాబా' అని నామకరణము చేయుట. 'నామి-నామముల' మహత్త్వము, నామికంటె నామమునఁగల విశేషశక్తి, సాయీబాబా హైందవుఁడా? మహమ్మదీయుఁడా? అనువిషయములు చర్చింపఁబడినవి. 1886 లో 72 గంటల సమాధినిగూర్చి తెలుపఁబడినది.

జాతి మతములు మానవకల్పితములు. భగవంతునకెట్లు జాతి మతములులేవో బ్రహ్మవిదుఁడగువానికిని లేవు. సామాన్యమానవులు భ్రమపడు టేమి ఆశ్చర్యము?

అకల్‌కోట మహారాజు-నాందేడ్ మాలా-నాగపూరులోని తేజుద్దీన్‌బాబా - శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామి మొదలగు సాధుసిద్ధపురుషులు బాబాను తమ కగ్రజుఁడుగఁ బ్రకటించి గౌరవించినారు. పూనానుండి 'కాశీబాయికనిత్కార్' అను విదుషీమణి యొకర్తు 'బాబామహమ్మదీయుఁడా? హైందవుఁడా? యథార్థము పరీక్షించి తెలిసికొనవలయును' - అని శిర్డీకిఁ జేరినది. ద్వారకామాయి మసీదు మెట్లెక్కఁబోవుచుండఁగా లోపలనుండి బాబా వెలుపల కామె కెదురుగవచ్చి, వ్రేలితోఁ దన్ను జూపుకొనుచు-

"బ్రాహ్మణుఁ డితండు, స్వచ్ఛమౌ బ్రాహ్మణుండు
పావనబ్రాహ్మణుఁడు కోట్లప్రజల కిట్టి
మార్గమున నడిపించి, గమ్యస్థలంబు
నందఁజేయు; నియ్యదియె బ్రాహ్మణమసీదు."

అని, విస్పష్టముగఁ బలికినంత నా తల్లి దిగ్భ్రమచెంది సాయిప్రభువు తన హృదయాంతర్వర్తియగు దైవముగ నెఱింగి

బాబాపదముల వ్రాలి, మ్రొక్కి సంశయనివృత్తి నొందినది. ఇట్లు బాబాను పరీక్షించినవారు పలువురు బాబా "ప్రత్యక్ష దైవము" అను సత్యము గ్రహింపఁ జాలిరి.

21-5-1936న శ్రీమతి మేనేజరు సతీమణి (Holy City) పూజ్య శ్రీ బి.వి. నరసింహస్వామిగారికి తెలిపిన విషయములు పాఠకులు గ్రహించుట యెంతయు నవసరము.

"ఇతర సాధువులకు సాయిబాబాకుఁగల భేదము గమనింపఁదగి నది. పలువురు ప్రసిద్ధులైన యోగులను నేను సందర్శించి యుంటిని. గొప్ప సమాధి నిష్ఠయందుండుట తరువాత కొంతతడవునకు దేహస్మృతిగలిగి మన హృదయముల నున్న విషయముల గుఱించి సమాధాన మిచ్చుట గమ నించితిని. కాని బాబావిషయమున నొక ప్రత్యేకత కలదు. ఏయొక విషయ మును దెలిసికొనుటకుగాని, తెలుపుటకుఁగాని, ధ్యానసమాధినిష్ఠ బాబా పొందవలసిన పనిలేదు, ప్రతి క్షణము బాబా ద్వివిధములగు స్పృహలను బ్రకటింపఁగలఁడు. ఒకట 'సాయిబాబా' అను ప్రాకృత స్థితియందుండి తన నాశ్రయించు ప్రాకృత జీవుల లౌకిక-ఆధ్యాత్మిక విషయముల గుఱిం చుచుఁ దోడ్పడుచు,-మఱియొకట, సర్వభూతాత్మ భూతాత్మస్థితి - సచ్చి దానంద స్థితియందుండును. అట్టిద్వివిధములగు స్పృహల కనుగుణ్యములగు శక్తి సంపదల నిర్వహించుచు బ్రదర్శించుచునే యుండును. ఇతర సాధువులు తాత్కాలికముగ దేహవిస్మృతిఁబొంది, (సమాధినిష్ఠ నొంది) తిరిగి దేహ స్పృహ బడయుచుందురు. కాని, సాయిబాబా యీ భౌతికప్రపంచమున వెలిని లోపల నెల్లవేళల నధివసించుచునే యుండును. ఇతర యోగులు జనుల హృదయములనున్న విషయముల గమనించుటకు,- వారివారి పూర్వ వృత్తాంతముల గ్రహించుటకు కొంతప్రయత్నమునలిపి శ్రమపడుచుందురు. కాని బాబా యీసమాత్రమేనియు ప్రయత్నము చేయవలసిన పనిలేదు. ఎల్లప్పుడెల్ల విధముల సర్వజ్ఞత్వస్థితియందే యుండును. సాయిప్రభువు సహజస్థితి యెల్లర కెఱుకపడునదికాదు. సామాన్యులకు దురవగాహము."

**చతుర్థాంశము :-**

1886 సంవత్సరమున 72 గంటల సమాధి అనంతరము బాబాస్థితినిగూర్చి యిందు వివరింపఁబడినది. 'నేను దైవమును జూడఁబోవుచున్నాను' అని శరీరమునువిడిచి, 72గంటలతరువాత తిరిగి శరీరమునఁ బ్రవేశించి, 'దైవమును(అల్లాను) చూచితిని' అని మహల్సాపతితో చెప్పినాఁడు. దైవమునుజూచుట-దైవమును పొందుటే-అనఁగా దైవస్వరూపుఁ డగుటయే. సాకారస్థితినుండి సర్వవ్యాపకత్వస్థితిఁ బడయుటయే. సద్గురు వేంకుశుని కృపావిశేషమున సాక్షాత్కారియైనాఁడు. బాబా ఎల్లెడ-తనయందు- సకలభూతములందు వాసుదేవ పరబ్రహ్మమును జూడఁగలిగినాఁడు. 1886 న 72 గంటల సమాధి అనంతరము తాను 'వాసుదేవ పరబ్రహ్మమే' అయినాఁడు. భౌతిక దేహమున్నను లేకున్నను సాయీప్రభువునకు సమానమే. 1886 నుండి 1918 వరకు సాయీబాబా ఎక్కడున్నవాఁడో నేటికి నిఁకేనాటికి నక్కడే యుండువాఁడు. అనగా సర్వవ్యాపకుఁడై యున్నాఁడు.

శ్రీకృష్ణుఁడు ద్వారకలో రుక్మిణీదేవితో చదరంగమాడుచు నానందించుచున్నట్లు కనఁబడినను, కౌరవసభలో దుశ్శాసనుఁడు ద్రౌపది కట్టుపుట్టముల నొలుచుట గమనించుచునే యున్నాఁడు.

శంఖ చక్రగదా పాణే। ద్వారకా నిలయాఽచ్యుత।
గోవింద। పుండరీకాక్ష। రక్ష మాం శరణాగతామ్.

అని ప్రార్థించు ద్రౌపది ప్రార్థన వినుచునేయున్నాఁడు "అక్షయమస్తు!" అని పాచికలు విసరినాఁడు. దగ్గఱనున్న

రుక్మిణి కామాటలు అర్థముకాలేదు. కాని, ద్రౌపదికి అక్షయ వలువలు ప్రసాదింపఁబడినవి. ఆ పతివ్రతామతల్లి మానమును శ్రీకృష్ణుఁడు కాపాడినాఁడు. శ్రీకృష్ణుఁడుద్వారక యందున్నట్లు మాత్రమే కనఁబడినను సర్వవ్యాపకుఁడై సర్వనియంతయై యున్నవిధమున, శ్రీసాయిప్రభు శిర్డీయందుఁ దనబిడ్డలతో ముచ్చటలాడుచున్నను — హరిశ్చంద్రపర్వతముపై 'చందోర్కరు' దప్పికచే బాధనొందుట గమనించుచునే యున్నాఁడు. "అరే! 'నానా' దప్పికచే చావనున్నాఁడు. నేను చావనిత్తునా?" అని బాబా పలుకు మాటలు దగ్గఱనున్నవారికి బోధపడలేదు. హరిశ్చంద్ర పర్వతముపై భిల్లునిరూపమునఁ దోఁచి 'నీవుకూర్చున్న బండక్రిందనే జలమున్నది- త్రాగుము. అని చెప్పి అదృశ్యుఁడైనాఁడు. ఇట్టి ఘట్టములు బాబాభక్తులగు చందోర్కరు- ఉపాసనీబాబా- దాసగాణు- ధుమాల్- నార్కే- నాచ్నే- సాతే- కాకాదీక్షిత్ మొదలగువారి యనుభవములలో పెక్కులు గలవు.

ఒక సందర్భమున శిర్డీయందు 'కాకాదీక్షిత్తు' బాబా యెదుట విచారముతోనుండగఁ "అరే! కాకా! తూలా కాల్జీ కాశ్లీ; మాఝే సారా కాల్జీ ఆహే!" (ఓయీ! కాకా! నీ కేల యీవిచారము? నీ యెల్లభారములు విచారములు నావే!) అని బాబా అభయ మిచ్చెను.

ఒకయెడ "బాబా! నా తమ్మునకు నేనెట్టి సహాయము చేయలేని స్థితిలో నున్నాఁడను" అని దీక్షిత్ విచారము దెలుపఁగా "నేను సహాయముఁ జేయఁగలస్థితిలో నున్నాడను" అని

శిర్డిలో బాబా పలుకుచునేయున్నాఁడు- 'బాంద్రా' యందు ఆ క్షణముననే ఒక సాధురూపమున దీక్షిత్ తమ్మునితో "నేను నీకు సహాయముఁ జేయఁగల స్థితిలో నున్నాఁడను" అని, అభయ మొసంగినాఁడు. ఇట్టివి- బాబా సర్వ వ్యాపకత్వ- సర్వనియంతృత్వ విషయములు "ఏమిా, నిన్ను పేక్షింతునా?" (సాయిబాబా పూర్వచరిత్ర- భక్తుల అనుభవములు) అను గ్రంథమున కోకొల్లలుగఁ గలవు.

గారడీలు- మాంత్రికులు- విషవినోదులు- ఐంద్రజాలికులు ప్రదర్శించు (తమాషాలు) చమత్కారములను గాంచి యట్టివి సర్వవ్యాపకత్వ- సర్వజ్ఞత్వ- సర్వనియంతృత్వములుగ భ్రమపడ రాదు. అట్టి చమత్కారములను నీచోపాసనల బలమునఁ బలువురు ప్రదర్శించగలరు. అంతమాత్రమున వారిని దైవము- భగవదవతారమని చెప్పజాలము. శ్రీసాయిప్రభు వేవేని యద్భుత లీలలను ప్రదర్శించిన తన బిడ్డలకొఱకే- నిస్స్వార్థబుద్ధితో ప్రదర్శించెను గాని, తన జీవికకు- పేరుప్రతిష్ఠలకు- మఱే యే యితర లౌకిక కాంక్షల కొఱకు ప్రదర్శించి యుండలేదని పాఠకులు గ్రహింపనగును. అణిమాది సిద్ధులు బాబాప్రోల ముప్పది నలుబది సంవత్సరములు వేచి, పడి యున్నను వానివంకకన్నెత్తియైనచూచియెఱుగఁడు. మిఠాయి- పండ్లు- మొదలవి తెప్పించుచు చమత్కారములను ప్రదర్శించు "కుశభావ్" మొదలగు ఆశ్రితులను మందలించి, అట్టి నీచోపాసనలు తగవని, బాబా వారు ధరించిన కడియములు- మొదలగు వానిని తీయించి దూరముగఁ బాఱవేయించినాఁడు

బాబా యెదుట మతవిభేదములు లేవు; తన బిడ్డలలో నెవరినిఁ దమ తమ మతములను మార్చుకొనుమని ఎన్నఁడు బోధించి యెఱుంగడు. ఆశ్రితులలో నొకఁడగు అప్పాకులకర్ణిని, "మోహినీరాజు" ను (శివావతారము) సేవింపుమని 'నివాస్' అను పట్టణమునకు పంపెను. 'శ్యామా' అను భక్తుని 'వాసీ' సేవచేయుమని నియమించెను. 'మేఘుని' - ఖండోబాను (శివావతారము) పూజింపుమనెను. మార్గమున దత్తాత్రేయ స్వామిని దర్శింపకయే వచ్చిన నానాసాహెబ్ చందోర్కరును మందలించెను. తనబిడ్డలు 'నహినిందన్యాయమున' వర్తించుటయే బాబా ఆశయము. శ్రీ సాయి పదాంబుజాంకిత భక్తుఁడు మకరంద లుబ్ధ మధుపమువలె ప్రవర్తించువాఁడు.

"అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్
పరంభావ మజానంతో మమ భూత మహేశ్వరమ్."

"అఖిలభూత నియామకమైన నాదు
పరమభావంబు నెఱుఁగని వార లగుచు
నరశరీరంబుఁ బొందిన నన్ను మూఢ
జనము లవమానమును జేతు రనఘచరిత్ర!"

"మహాత్మానస్తు మాంపార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః
భజం త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్."

"అర్జునా! మహాత్ములు దైవియౌ ప్రకృతిని
నాశ్రయించినవారలై వ్యయ విహీను
సకల భూతాద్యుఁడైన నన్నరసి మదిని
నితరచింతల వదలి భజించుచుంద్రు".

(భగవద్గీతామృతము ౯. ౧౧, ౧౩)

భగవద్గీతలందు దైవాసుర సంపద్విభాగ యోగమను పదునారవ అధ్యాయమున- దైవసంపద గలవారిని- ఆసుర సంపదఁగలవారినిఁ గూర్చి వివరింపఁబడినది. లోకమునందలి జనులు మూఢులు-మహాత్ములు అని రెండు తెగలుగ విభజింప నగును. చదువనివారిని 'మూఢు' లనఁదగదు. గొప్పచదువులు చదివినవారిని 'జ్ఞానులు' అని చెప్పఁజాలము. 'దైవభక్తి'- 'ఆధ్యాత్మికచింతనము' గలిగి దైవసంపదయందు వివరింపఁబడిన గుణములుగలవారే 'మహాత్ములు'. అవిలేనివారు-ఆదైవ సంపదకు విపరీతములగు గుణములు గలవారు- ఆసురభావము గలవారు 'మూఢులు'. ఆధ్యాత్మిక విద్యాసంపదలు పరాభక్తి వలన- దైవకరుణవలన మాత్రమే లభ్యమగును. దైవమును గూర్చి- దైవమున కభిన్నులగు సిద్ధసాధువులనుగూర్చి సత్యము గ్రహించుటయే 'ఉత్తమవిద్య.' అట్టి విద్యవలననే దైవము నెఱుఁగుటకుఁగాని, దైవమును పొందుటకుఁగాని సాధ్యమగును మఱియొకవిధమున సాధ్యముకాదు.

"భక్త్యా మా మభి జా నాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్."
ఏ నెవంతనొ; మఱి, యెంతటివాఁడనొ
యతఁడు భక్తిచే యథార్థరీతి;
అటుల వాఁడు నన్ యథార్థంబుగాఁ గని
పిదప నన్నె పొందు విమలచరిత!

(భగవద్గీతామృతము ౧౮. ౫౫

శ్రీకృష్ణపరమాత్మ తన విశ్వరూపమును అర్జునునకు ప్రదర్శించి యట్టి తనరూపమును దెలిసికొనుటకుఁ బొందుటకు 'అనన్యభక్తి' తప్ప గత్యంతరములేదని ఘంటాపథముగఁ దెలిపినాఁడు.

'నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా.
భక్త్యాత్వ నన్యయా శక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప ॥
దాన యజ్ఞములను దపముల శ్రుతులను
బ్రతిభఁగాంచినట్టి వారికేని
నిపుడు నీవుగనిన యట్టి నా విశ్వరూ
పంబుఁగనఁగ దుర్లభంబు ; పార్థ !
అన్యచింతలేని యట్టి సద్భక్తి ని
న్నరయఁ దెలియఁ బొంద నగును గాని
వేఱు సాధనమున వేరరు వన్ యథా
ర్థముగఁ గాంచఁ; వైరి దర్పహరణ !"

(భగవద్గీతామృతము ౧౧-౫౩,౫౪)

బాబా స్వానుభవమున - సద్గురు వేంకుశుని సేవవలన గ్రహించినది-తనబిడ్డలకు బోధించిన పరమ రహస్యమిదియు.

"దారాలు గురునందుభక్తి — విశ్వాసబుద్ధి"

(శ్రీ సాయీకరుణ-86 పుట)

(నారద భక్తిసూత్రములు. 0, 6, 7, 9. 10. 19, 41. ఈసూత్రములకు వివరణము "ప్రేమామృతము" నందు పాఠకభక్తులు గమనింపనగును)

సద్గురువు అనుగ్రహమున ప్రేమ వస్తువు తనయందు ప్రవహించుట బాబా గ్రహించెను. ధారణ-ధ్యాన-సమాధినిష్ఠలు వాని యంతట నవియే ప్రాప్తించును. ప్రేమి ప్రేమ వస్తువునందు లయమగుచుండును. ప్రేమి-ప్రియు లైక్యము నొందుదురు.

(భ్రమర కీటకన్యాయము గమనింపుడు) ప్రేమయంత్రము శ్రీసాయీబాబా అని పాఠకులు గ్రహింపఁదగును. ఆ కారణముననే బాబా ఒకపరి యిట్లనినాఁడు.

"ఈ మసీదున మెట్ల నెక్కెడువారు
ప్రేమ సామ్రాజ్య మేలింపఁ గలారు;
శ్రీరామసాయి వసించు నీగృహము
ద్వారకామాయి—సత్యంబు—పావనము".

'శిరిడీయందలి' "సాయీబాబా" 'దేవుఁడా? కాఁడా?" అను ప్రశ్నమునకు ఒక్కటే సమాధానము. 'త్రిసత్యముగ దేవుఁడే!' "మనుష్యరూపమునున్న దైవమే" ఆ తండ్రి సకలము నెఱుఁగఁ గలఁడు. ఎల్లర హృదయముల నధివసించి, వారివారి మనోవృత్తులు గుర్తించి, నియమింపఁ గలఁడు. పంచభూతముల శాసింపఁగలఁడు. తన యిచ్ఛప్రకారము సకలము నడిపింపఁ గలఁడు. నిస్వార్థత-సేవ-ప్రేమలు ఆతండ్రియందు మూర్తీభవించినవి. సకలజీవములందు-తుదకు నీచ-అల్ప-జీవములందు సైతము సాయీప్రభువునకు గల ప్రేమ అపారము.

అనంత శక్తిసంపదలు గలిగి, ఎల్లర ప్రార్థనలు ననుగతి నాలకించుచు, విశ్వజననివలె నెల్లరనాదుకొని రక్షించువస్తువే మనదృష్టియందు 'దైవము'—సాయీబాబా సర్వభూత హృదయాంతర్వర్తి-సర్వభూతాంతర్యామి-అని, తెలిసికొనఁజాలిన వారు బాబాను దైవమనియే గుర్తించి సేవించిరి - సేవించుచున్నారు.

సాయీబాబా-ఆధునిక ప్రవక్త-ఎల్లర నెఱుఁగువాఁడు. ఎల్లరు బాబా నెఱుఁగఁగనగును. ఇది "సాయీ ఋతువు" బాబా అనుగ్రహ మెల్లరు పొందఁజాలుదురు. సకల లౌకిక పారలౌకిక ఫలసిద్ధులను బాబానాశ్రయించిన భక్తులందఱు బడయఁగలరు

శ్రీసాయీకరుణ ఒకేజాతికి- ఒకేతెగకు ఏయొక్కరికో నిర్దేశింపబడలేదు. ఋజు ప్రవర్తనులై 'నిష్ఠ' (విశ్వాసము) 'సబూరి' (ధైర్యముతోఁ గూడిన ఓర్పు) అను కానుకల రెంటిని బాబాకు సమర్పించి సేవించు వారెల్లరు "ఆచిచ్ఛక్తి- జీవనశక్తి-జ్యోతిశ్శక్తి- ప్రేమశక్తి" యగు బాబా కరుణకు పాత్రులగుదురు. 'దైవము' అను పదమునకు నిర్వచన మిదియే. దీనికి బాబా నిలువఁగలఁడు. ప్రతిభక్తునిపరీక్షకు సాయిప్రభువు సమాధాన మీయఁగలడు. తన్నాశ్రయించు ప్రతిజీవిని ఎల్లవిధముల ననుగ్రహించి సర్వహిత వరప్రదాయియై తాను 'దైవము-భగవానుఁడు-అల్లా' అని ఋజువుచేసికొనఁ గలడు. శ్రీ సాయిబాబాయొక్క అనంతశక్తిసంపదలు మానవుల స్వల్ప శాస్త్ర జ్ఞాన శక్తి సంపదల కొలమానముచే తెలియఁగునవి కావని సోదరభక్తులు గ్రహించుట శ్రేయస్కరము.

ధన్యం బీభువి, ధన్యు లా పితరులున్, ధన్యుల్ ప్రజల్, యోగి మూ
ర్త్యన్యున్ సాయినిఁజేరి యెల్ల పరిచర్యల్ చేయు భాగ్యోత్తముల్;
ధన్యుల్ యీకృతి భక్తబృందమున కందంజేయు ధర్మాత్ములున్
ధన్యుల్ -ధన్యులు - సాయి సత్పదయుగ ధ్యానామృతాస్వాదనుల్।

సాయిబాబా ఎల్లర ననుగ్రహించుఁ గాత!

ఓమ్

శ్రీ సాయీప్రసన్న । శ్రీసాయీ సమర్థ।

శ్రీ సాయీకుటీరము,
చిన్నగంజాము P. O.
గుంటూరుజిల్లా (S. Rly)

25-12-1960

ఇట్లు,
శ్రీ సాయీభక్తచరణ పరిచరణుఁడు

బాపట్ల హనుమంతరావు



ఓమ్

శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయీనాథాయనమః

# సాయీబాబా కూడ దేవుఁడేనా?

## ఉన్నదేవుళ్ళు చాలకనా?

(సందేహ నివృత్తి)

## ప్రథమాంశము

---

1966వ సంవత్సరమున నొకనాడు "సాయి లీల"(మాసపత్రిక-చీరాల) పత్రికకు చందాదారుఁడుగఁ జేర్పించుటకై నే నొకమిత్రుని దగ్గఱకువెళ్ళి చందాదారుఁడుగఁ జేరుమని కోరితిని. "సాయీబాబా కూడ దేవుఁడేనా? ఉన్న దేవుళ్ళు చాలక నా?" యని యాతఁడు నన్ను ప్రశ్నించెను. అంతట నేను "అవును-దేవుఁడే-చాలకనే" అని, సమాధానము చెప్పితిని.

కాని, నామిత్రునినోటనుండి వెలువడిన ఆ మాటలకు నా అభిమానము దెబ్బతినినది. 'పత్రికకు చందాదారుఁడుగ చేరకపోయిన పోనిమ్ము- బాబాను లాఘవపఱచుచున్నాఁడే!'- అని కోపముకలిగినది. ఏమని కోపించుట?- ఎవనిపై కోపించుట? అను ప్రశ్నములు మనస్సునఁ బొడమినవి. వెంటనే బాంద్రా బాలుని (Master. T) వృత్తాంతము జ్ఞప్తికివచ్చెను. (చూడుడు శ్రీ సాయీకరుణ, పుటలు 109-111).

బాంద్రా బాలుని (Master. T) బాపూసాహెబ్ జోగ్ దగ్గఱకువెళ్ళి దక్షిణ అడిగి తెమ్మని బాబా నియమించెను. సాఠేవాడలో జోగ్ మఱి కొందఱు ధ్రువచరిత్రము చదువుచు "సాధువులు భగవదనుగ్రహమునఁ గొన్నిశక్తులు సంపాదింపఁగలిగినను వారు దైవము కారు" అని వ్యాఖ్యానము చేయుచుండిరి. ఆమాటలు వినిన ఆబాలుఁడు కోపమునఁ దిరిగివచ్చి "బాబా! నన్నక్కడకేల పంపితివి? నీవు దేవుఁడవుకావని వారనుచున్నారు"- అని పలుకగా "అది సత్యమే- నేనొక పేదఫకీరును- అబ్బో! దేవుఁడెంత గొప్పవాఁడు! ఆయనతో నెవరును సరిపోలరు" అని బాబా పలికెను. ఇంతలో కొందఱు భక్తులువచ్చి, తమబిడ్డ మేడపైనుండి క్రిందఁ బడుట- బాబా ఆబిడ్డను రక్షించినవిధముఁదెలుప "ఏమిచేయఁగలను? నా బిడ్డఁడు కూలనున్న నే నుపేక్షింతునా? నా నాలుగు చేతులు చాచి వానినిరక్షింతును" అని బాబా వారితో ననినతోడనే బాంద్రా బాలుం డందుకొని "బాబా! నీవిప్పుడు 'దేవుఁడవుకా' నంటివే! నీవు నాలుగుచేతు లెట్లుకలిగియున్నావు"? అని ప్రశ్నించెను. శ్రీ సాయిప్రభువు సమాధానముచెప్పక ఆబాలునిపై ప్రేమ వీక్షణములఁ బఱపి, అంగీకారసూచకముగ చిఱునవ్వు నవ్వెను.

ఈవృత్తాంతమంతయు ఆక్షణమున నాకు తెలియకున్న మెఱసినది. సాయిలీల పత్రికకు చందాదారునిగఁ జేర్పించుటకు నామిత్రుని దగ్గఱకు పంపినవాఁడు బాబా- నామిత్రునిచేత ఆమాటలడిగించినవాఁడు బాబా- ఇది నాపరీక్షకొఱకే యని గ్రహించి తిరిగి వచ్చితిని.

ఏవిషయమునుగూర్చి యైన మనలఁ బ్రశ్నించు వారిపై కోపపడఁదగదు. అట్లు ప్రశ్నించువారే లేకున్న ఇన్ని శ్రుతి స్మృతి పురాణాదుల కవకాశముండెడిదియే కాదు. సందేహము లేనిదే ప్రశ్న రాదు. ప్రశ్నింపబడినపుడాగ్రహింపక తనకు తెలిసినవిధమున నేర్పున సమాధానము చెప్పఁదగును. లేకున్న మౌనమువహించి తొలఁగిపోఁదగును. మన శాంతిఁ గోల్పోవరాదు. పృచ్ఛకుని అంగీకార - అనంగీకారములతో నిమిత్తములేదు. మన మెల్లరను సమాధానపఱచి మనపక్షమున కాకర్షింపఁజూచుట వెఱ్ఱితనము. ఎవరియూహ ఎవరినిశ్చయము వారిదే. సత్యము నిలుకడమీఁద బోధపడఁగలదు.

ఈ విషయమునుగూర్చి పలుకఁబూనుట నాయట్టి స్వల్పునకు సాధ్యముకానిపనియని యెఱుంగుదును. పలుకుమని ప్రేరేపించువాఁడు సాయిప్రభువు. ఏ వేని లోపములున్న ఆ తండ్రియే సవరించుకొనుననూ విశ్వాసము కలదు. పెద్దలవలన గ్రహించినద్దియే లవమో పలుక నభిలషించువాఁడను. నేను విశ్వసించిన విషయములు తెలుపుటలో నితరుల నిశ్చయము నేను కాదనుటలేదు. అట్లనుటకు నాకధికారమును లేదు.

## నా మిత్రుని ప్రశ్నలు

1 సాయిబాబాకూడ దేవుఁడేనా?

2 ఉన్న దేవుళ్ళు చాలకనా?

ఈవిధముగ ప్రశ్నించిన నామిత్రుఁడు నాస్తికుఁడు (దేవుఁడు లేఁడనువాఁడు) మాత్రము కాఁడని స్ఫురించుచున్నది. ఇది సంతోషింపఁదగిన విషయము.

రెండవ ప్రశ్న "ఉన్న దేవుళ్ళు చాలకనా?" అనుటలో 'దేవుఁడు' అని చెప్పబడువారు పలుఁవురు కలరనియో—లేక మనముచూచు పలుమతములు-ఆ మతకర్తలు ప్రతిపాదించిన దైవములు - వానిమూలమున చెలరేగు వైషమ్యములు-కలహములు మొదలగునవి చదివి, విని, విసువు - నిస్పృహాత జనించుట వలననో అట్లడిగియుండవచ్చునుగాని, 'దేవుఁడున్నాఁడు' -అను భావనమాత్రము అతనిప్రశ్నలో స్ఫురించుచున్నది. ఈ రెండవ ప్రశ్నమునుగూర్చి విచారించి పిదప మొదటిప్రశ్న విషయమై ఆలోచించుదము.

## దేవుఁడెవఁడు ?

దేవుఁడెవఁడు?- అను ప్రశ్నమునకు సమాధానము ఆదేవునకే తెలియుక. అట్లని యెవరు నూరకొనుటలేదు. జ్ఞానులు తమతమ అనుభవములను కొంచెమో అధికమో పురస్కరించుకొని ఆదైవమునుగూర్చి పలుకుచునే యున్నారు. తత్వజ్ఞులు సాంకేతిక రూపమున దైవ స్వరూపమునుగూర్చి వర్ణించుచునే యుందురు. వాస్తవముగ వారెఱుఁగుదానికి వర్ణించుదానికి భగవానుఁడు విలక్షణుఁడుగనేయున్నాఁడు. వేద శాస్త్ర పురాణాదులు దైవమునుగూర్చి పలుకుచునేయున్నవి. వాని వచనము లాధారముచేసికొని వేర్వేఱుగ పలువిధముల పరమాత్మ వాస్తవిక స్వరూపవర్ణనముఁ జేయఁగోరువారును కృతకృత్యులు కానేరకున్నారు. ఇంకను ప్రయత్నించుచునే యున్నారు. ఈవివేచనమునం దొకటిమాత్రము నిశ్చయము. భగవంతుఁడుకలఁడు. దేవునియునికి విషయమున లవమైనయు సందియము లేదు.

"దేవుడు" - "దైవము" అని చెప్పబడు ఆ పర తత్త్వము వాదోపవాదములకు లొంగునదికాదు. ఇందలు ఇన్ని విధముల ప్రవచించినవి భిన్నములని మాత్రము మనము తలంచరాదు. పలుకులభేదమేకాని ఆ పరవస్తువునుగూర్చి యిందఱు చెప్పునది యొకటే గమ్యమొకటిగనే గోచరించు చున్నది. వేద వేదాంతములనాధారముచేసికొని స్మృతి పురా ణేతిహాసాదు లుత్పన్నము లైనవి. వీనినన్నిటిని పురస్కరించు కొని సకలమతాచార్యులు వారివారి సిద్ధాంతములను ప్రతి పాదించినారు. ఇన్నిమతములు స్థూలదృష్టికి భేదములుగ గోచ రించునుగాని, సూక్ష్మదృష్టితో పరిశీలించిన సకలమత సిద్ధాంత సారము ఒకటే. "దేవుడు కలడు అతడు సర్వాంతర్యామి అను ఎఱుకగలిగి ఆదైవమును సేవించి మనము తరించవల యును"— అని ప్రస్ఫుట మగుచున్నది.

వేదములకంటె సనాతనగ్రంథము లీప్రపంచ వాఙ్మయ మున లేవు. ఋగ్వేద మిట్లుచెప్పుచున్నది.

తమ ఆసీ త్తమ సా గూళ హమగ్రే
ప్రకేతం సలిలం సర్వమా ఇదమ్
తుచ్ఛ్యేనా భ్యపిహితం యదాసీత్
తపస స్త న్మహినా జాయతై కమ్.

( 8-7-17-3 )

ఈ విశ్వ సృజమునకు పూర్వ మంతటను అంధకార మావ రించియున్నది. ఆ యంధకారము వెలుపల లోపల నంతటను స్వయంభువు- జ్ఞానస్వరూపుడు భగవానుడుండెను. అతడు ఆద్యంతరహితుడు. ఆచీకటినుండి అతడు ప్రకటమై తన తప శ్శక్తిచే- జ్ఞానశక్తిచే ఈ విశ్వమును సృజించెను.

ఈ అభిప్రాయమునే మనువు వెలిపుచ్చెను.

ఆసీ దిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్
అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః॥
తతఃస్వయంభూ ర్భగవా నవ్యక్తో వ్యంజయన్నిదమ్
మహాభూతాది వృత్తౌజాః ప్రాదురాసీ త్తమో నుదః॥
యోఽసావతీంద్రియ గ్రాహ్యః సూక్ష్మోఽవ్యక్తస్సనాతనః
సర్వభూత మయోఽచింత్యః స ఏవ స్వయముద్బభౌ॥

మనుస్మృతి 1-(5-7)

ఈ సృష్టికిఁ బూర్వము అంధకారము తప్ప యేమియు లేదు. అంతయు ప్రసుప్తము (నిద్రితము) నైనట్లుండెను. ఆ తమసమునుండి జ్ఞానమయము-ప్రకాశమయమునగు తత్త్వము స్వయంభువు - స్వమహిమ నాధారము చేసికొని, యేయితర ముపై నాధారపడని 'భగవానుఁడు' ప్రకాశించెను. తోడనే ఆచీకటి తెర తొలఁగెను. అతఁడు ఇంద్రియములకు గోచరింపక సూక్ష్మము-అవ్యక్తము-సనాతనము-అచింత్యము- సర్వభూతమయమునై తనకుఁదా నుద్భవించినవస్తువు.
మఱియు వేదము లిట్లుచెప్పుచున్నవి.

"ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్
ఏకమేవాఽద్వితీయమ్"
"ఏకం సద్విప్రా బహుధా వదంతి"
"ఏకం సంతం బహుధా కల్పయంతి"

భాగవత పురాణమున

"అహమేవా సమేవాగ్రే నాన్యద్యత్ సదసత్పరమ్
పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహమ్"

(భా. [illegible])

సృష్టి ప్రారంభమున నేనొక్కఁడనే వ్యక్తావ్యక్తముల కతీతుఁడనై యున్నాను. వేఱువస్తువు లేదు. మహాప్రళయమువందును శేషించునది నేనే. ఈదృశ్యవిశ్వము నాకంటె వేఱు కాదు. చివరకు శేషించునదియు నేనే.

మఱియు భాగవతమున దశమస్కంధమున నిట్లు చెప్పఁబడినది.

ఏకస్త్వ మాత్మా పురుషః పురాణః
సత్యః స్వయం జ్యోతి రనంత ఆద్యః
నిత్యోఽక్షరోఽజస్ర సుఖో నిరంజనః
పూర్ణోఽద్వయో ముక్త ఉపాధితోఽమృతః॥

(౧౦—౧౪—౨౩)

ఆతఁడే ఆత్మ- పురాణపురుషుఁడు- సత్యుఁడు-స్వయం జ్యోతి- ఆద్యంతరహితుఁడు, నిత్యుఁడు, అక్షరుఁడు, శాశ్వతానందుఁడు, మాయాతీతుఁడు, పూర్ణుఁడు, అనూపముఁడు, నిర్గుణుఁడు, అమృతస్వరూపుఁడు నగుచున్నాఁడు.

ఈవిధముగ శివపురాణాదులును దెలుపుచున్నవి.

## భగవంతుఁడున్నాఁడని మనము విశ్వసించుటెట్లు?

భగవానుఁడు 'కలఁడు'-'కలఁడు'-అని ప్రతిపాదించు వేదములు - ఈచర్మచక్షువులతోఁ జూడఁజాలమని పలుకుచున్నవి.

న సందృశే తిష్ఠతి రూపమస్య
న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్
జ్ఞాన ప్రసాదేన విశుద్ధ సత్త్వ
స్తతస్తుతం పశ్యతే నిష్కలంధ్యాయమానః॥

ఎవఁడును ఆ భగవానుని తననేత్రములతోఁ జూడఁజాలఁడు. కాని, హృదయ కల్మషముల నిర్మూలించి, నిర్మలమైనబుద్ధితో మనము చూడఁగలుగు చున్నారము.

మన విశాభౌతిక ప్రపంచమున కనులు తెఱచినది మొదలు దీనిని విడచు పర్యంతము చిత్రవిచిత్రములైన విష యములఁ జూచుచున్నారము. పెక్కు-చోద్యములు మనకనుల యెదుట పొడమి పెంపొంది అంతరించుచున్నవి. సూర్య చంద్రాది గ్రహములు, నక్షత్రములు వాని వాని నియమిత స్థాన ములందుండి ఆకాశమున సంచరించుచున్నవి. "ఇవియన్నియు పంచ భూతాత్మకమైన వస్తు మిశ్రితములై అన్యోన్యాకర్షణ శక్తులతో ప్రవర్తించుచున్నవా ? లేక, ఇంతవిశ్వమును నియ మితబద్ధముగ కల్పించి ప్రవర్తింపఁజేయు విశ్వ నియంత-విశ్వ కర్త యొకఁడున్నాఁడా ?" అని మనమూహించు కొనుచుం దుము. ఊహించి, ఊహించి, తుదకు "ఏదోయొక అవాఙ్మా నస గోచరమగుశక్తి- ఒక నియంతకలఁడు."-అను నిశ్చయము నకే వచ్చుచుందుము. మననిశ్చయమును వేదములును సమ ర్థించుచున్నవి.

"సూర్య చంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్
దివంచ పృథివీంచాంతరిక్ష మథోస్వః"

సూర్య చంద్ర భూమ్యాకాశాదులను భగవానుఁడే సృష్టించెను. ఈ విశ్వమున గోచరించు పలువిధములగుజీవముల పుట్టువు-వృద్ధి-క్షయములఁ బరిశీలించిన ఆదైవమహిమ మనకు ఆశ్చర్యము కలిగించును. ఈవిశ్వ సృష్టికి ఆద్యంతములు మన

తెలుసుకొనబడవు. సృష్టిమొదలు ఏదో అద్భుత శక్తియొకటి కలదని పూని యీ విశ్వమును నడుపుచున్నట్లు మనము గ్రహింపఁగలము.

కావున ఈసృష్టికి ఆది- సనాతన- అజ- అవినాశి- జగద్వ్యాపకమగు గొప్ప కారణముగలదని తోఁచును. ఆమహా కారణము- ఆ భగవానుఁడు అనంత శక్తిసంపన్నుఁడగు, సర్వజ్ఞత్వ, సర్వనియంతృత్వ సర్వవ్యాపకత్వములు గలిగిన సచ్చిదానంద రూపుఁడని తెలియవగును. ఆవర్ణనాతీతశక్తి- ఆవస్తువు అనంతనామములు, పరమేశ్వరుఁడు- పరబ్రహ్మ- బ్రహ్మము- నారాయణుఁడు- భగవానుఁడు - వాసుదేవుడు శివుడు- విష్ణువు- రాముఁడు- కృష్ణుఁడు- జహోవా- దేవుఁడు- ఖుదా- అర్హుఁడు-బుద్ధుఁడు- అల్లా మొదలగు నామములఁ బిలువఁబడుచున్నాఁడు.

ఒక్కఁడయ్యును "త్రిమూర్తులు" గఁ జెప్పఁబడుచున్నాఁడు.

ఏక మద్వితీయమగు ఆ పరబ్రహ్మమే బ్రహ్మ- విష్ణు- మహేశ్వరులుగఁ జెప్పఁబడుచున్నాఁడు.

విష్ణుపురాణమున.

"సృష్టిస్థిత్యంత కారిణీం- బ్రహ్మ విష్ణు శివాత్మికామ్
స సంజ్ఞాం యాతి భగవా నేక ఏవ జనార్దనః"

భగవానుఁడగు జనార్దనుఁ డొక్కఁడే అయ్యును విశ్వమును సృజించినపుడు బ్రహ్మయనియు, పోషించునపుఁడు

విష్ణువనియు, లయముచేయునపుడు శివుఁడనియు త్రివిధనామ
ముల వహించుచున్నాఁడు.

శ్రీమద్భాగవతము:-

"ఆత్మమాయాం సమావిశ్య సోఽహం గుణమయీం ద్విజ
సృజన్ రక్షన్ హరన్ విశ్వం దధ్రే సంజ్ఞాం క్రియోచితామ్"

ఓ బ్రాహ్మణుఁడా! త్రిగుణాత్మకమగు నా మాయ యందు ప్రవేశించి విశ్వ సృజన రక్షణ లయములను గావించుచు క్రియోచితములగు నామముల ధరింతును.

ఈ ప్రమాణముల ననుసరించి బ్రహ్మవిష్ణు మహేశ్వరులు భిన్నులని తలఁపదగదు. ఆ మూఁడునామములు ఒకే దైవముయొక్క తత్తత్క్రియోచితములగు సంజ్ఞలని గుర్తించవగును.

ఆదైవ మెట్లుండును:-

వేదములు ఆదైవమును "సత్యంజ్ఞాన" మనంతం బ్రహ్మ అని వివరించుచున్నవి.

శ్రీమద్భాగవతము:-

"విశుద్ధం కేవలం జ్ఞానం ప్రత్యక్ సమ్యగవస్థితమ్
సత్యం పూర్ణ మనాద్యంతం నిర్గుణం నిత్య మద్వయమ్॥
ఋషే విదంతి మునయః ప్రశాంతాత్మేంద్రియాశయాః
జ్ఞాన మాత్రం పరంబ్రహ్మ పరమాత్మేశ్వరః పుమాన్
దృశ్యాదిభిఃపృథగ్భావై ర్భగవానేక ఈయతే"॥

దైవము (పరబ్రహ్మ) సత్యస్వరూపుఁడు-నిత్యుఁడు-ఇదివఱకు-ఇప్పుడు- ఇఁకమీఁదనుండువాఁడు- సర్వవేత్త- సర్వజ్ఞుఁడు- ఆనందమయుఁడు. ప్రత్యేకతనువు లేక యే క్షయకరములగు వివిధ తనువులద్వారా ఈ జగన్నాటకమును ఆడించు చున్నాఁడు. సూత్రధారుఁడు - నిర్మలుఁడు- జ్ఞానమయుఁడు - పూర్ణుఁడు - ఆద్యంత రహితుఁడు - అద్వితీయుఁడు - ఒక్కఁడయ్యును వివిధరూపముల గోచరించును.

## మఱియొక సందర్భమున :-

"వివిధ తనువులం దాత్మయై ప్రకాశించి ఆ పురాణ పురుషుఁడు స్వయంప్రకాశుఁడు అజుఁడు- పరమేశ్వరుఁడు- నారాయణ- భగవంత- వాసుదేవ శబ్ద వాచ్యుఁడై తాను సృజించిన ప్రకృతిరూపమును (యోగశక్తి రూపమగు) తన మాయచే ప్రకాశింపఁ జేయుచున్నాఁడు." అని చెప్పఁబడినది.

భాగవతము- ద్వితీయస్కంధము- తృతీయాధ్యాయము సకలమునకు మూలాధారమగు ఆదైవమును (పరబ్రహ్మను) గూర్చి విపులముగ వివరింపఁబడినది.

"ఓ మునీంద్రులార! తత్త్వవిదులలో మీర గ్రేసరులరు. నారాయణుఁడని చెప్పఁబడు ఆపరమాత్మ-ఆ పరబ్రహ్మమును గూర్చి విస్పష్టముగ నాకెఱుఁగఁ బలుకుఁడు"- అని, రాజర్షి జనకుఁడు మునులనుగోరెను.

## పిప్పలాయనుఁడిట్లనెను :-

ఓ రాజా! తాను స్వయముగ కారణరహితుఁడయ్యును ఆ పరతత్త్వము- నారాయణుఁడు- ఈవిశ్వసృజన పాలన

సంహారములకుఁ గారణుఁడని యెఱుంగుము. లోపల వెలుపల పూర్ణుఁడై స్వప్న జాగ్రత్సుషుప్తులనఁబడు త్రివిధావస్థలందును ఇంద్రియ ప్రాణ హృదయాది కృతులఁ బొనరింపఁ జేయు ఈ తనువులకు చైతన్యము సమకూర్చుచున్నాఁడు. విస్ఫులింగము లగ్నియందుఁ బొడఁబడ లేనివిధమున మనస్సు- వాక్కు-ప్రాణములు-బుద్ధి-జ్ఞానేంద్రియములు- కర్మేంద్రియములు ఆమూలతత్త్వమును గ్రహింపజాలవు. దానిని సమీపింపఁజాలవనిన వర్ణించుటేటిమాట? అతఁడు పుట్టఁడు-గిట్టఁడు-పెరుగఁడు-తఱుఁగడు జనన మరణాది వికార రహితుఁడు. సకల వికారావస్థలందు నతఁడు సాక్షిమాత్రుఁడు. ఎల్లెడ-ఎల్లప్పుడున్నాఁడు ఉండగలఁడు అవ్యయుఁడు- జ్ఞానమాత్రుఁడు. ప్రాణమనునది యొకేవస్తువయ్యు వివిధేంద్రియములద్వారా (కనులు చూచుట- చెవులు వినుట- ముక్కు మూర్కొనుట- మొదలగు) వివిధకర్మములఁ బొనరించుచు వేఱువేఱు శక్తులుగ భావింపఁబడు పగిది ఆత్మయు నొక్కటయ్యు వివిధతనువుల నాధారముచేసికొని ప్రవర్తించుటచే బహువిధములుగ ద్యోతకమగుచున్నాఁడు. విశ్వమందెల్లెడ ఆ దైవముకలఁడు దోమలు పక్షులు- జంతువులు- మనుష్యులు మొదలగు వానియందు- వేయేల? ఆచైతన్యశక్తి ప్రకటమగు నెల్లతావులందును గలఁడు. మనయందెల్లపుడు సాక్షిభూతుఁడుగ వెలుఁగొందు తత్త్వము- సకలేంద్రియములు చైతన్యముడిగి తునను "నేనున్నాను" అను మోహముకూడ తాత్కాలికముగ ఉడిగిన

సమయమున మేల్కొని "నేను మంచినిద్ర పొందితిని" "నేనీ స్వప్నముఁ గంటిని" అని మొదలగునవి తెలియఁజేయుచు మనయందెల్లవేళల నంటుకొని సాక్షిమాత్రముగ నుండు నదియే బ్రహ్మము దైవము" అని పిప్పలాయనుఁడు దన కున కెఱిఁగించెను.

## అద్వైత సిద్ధాంతము:-

"ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥

శ్వేతాశ్వతరోపనిషత్తు. (౬-౧౧)

ఒక్కఁడే యైనవాఁడు, సకల ప్రాణులయందు గూఢమై యుండువాఁడు, సర్వవ్యాపి, సకల భూతాంతరాత్మయు, సకల కర్మములకు ఫలమొసంగువాఁడు, సకలమును నధివసించువాఁడు, సాక్షిమాత్రుఁడు, జ్ఞానస్వరూపుఁడు, గుణరహితుఁడును నగు దైవము కలఁడు.

శ్రుతి స్మృతి పురాణములు ఏకకంఠమున ఆ పరమాత్మ జలమునందు అగ్నియందు వాయువునందు ఈ విశ్వమునఁగల తృణ గుల్మ లతాది సకల జీవములందు వ్యాపించి యున్నాఁడని తెలుపుచున్నవి.

"ఏషో దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః
హృదా హృదిస్థం మనసా య ఏవ
మేవం విదు రమృతాస్తే భవంతి"॥

ఆదైవము విశ్వసృష్టికర్త సకలజీవముల హృదయములందుం డును. హృదయస్థమైన ఆ పవిత్రమగు పరతత్త్వమును నిర్మలమైన మనస్సుతోఁ జూడనేర్చినవారు అమృతత్వము (విముక్తి) పొందుదురు. అని శ్రుతులు పలుకుచున్నవి.

"నీవార సూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా
తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః
సబ్రహ్మా సశివ స్సహరిః సేంద్రః సోఽక్షరః పరమస్స్వరాట్"

ఇట్టిప్రమాణము లనేకములు కలవు.

న తస్య కశ్చి త్పతిరస్తి లోకే
న చేశితా నైవచ తస్య లింగమ్
న కారణం కరణాధిపాధిపో
న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః॥

(శ్వేతాశ్వతరోపనిషత్తు. ౬.౯)

ఆతనికి ప్రపంచమునం దధికారి యెవఁడును లేఁడు. ఆతనిని రక్షించువాఁడు నెవఁడును లేఁడు. అతని కే గుఱుతయు లేదు; అతఁడు సర్వకారణ స్వరూపుఁడు. కారణ పురుషుల కెల్ల ప్రభువు. అతనిని పుట్టించినవాఁడు లేఁడు అధిపతియును లేఁడు.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా"
యంత్రమందు నున్న యంత్రచోదకు పట్లు
లీ సమస్త భూత హృదయములను
నిలచి యీశ్వరుండు నిజమాయచేఁ బ్రాణు
లను భ్రమింపఁజేయు ననఘ చరిత!

(భగవద్గీతామృతము. ౧౮ ౬౧)

యాజ్ఞవల్క్య మహాముని వేదప్రతిపాదితమగు ఈవిషయ మూను సంక్షిప్తముగఁ బలికినాఁడు.

ప్రతి మానవుని హృదయమునుండి 1,44,000 హిత అహితనాడులు శాఖోపశాఖలుగ శరీరమందంతట వ్యాపించి యున్నవి. ఆహృదయమునందు చంద్రరేఖవలె దహరాకాశము కలదు. అందు పవిత్ర నిత్యప్రకాశవంతమగు వెలుఁగు ప్రకాశించుచుండును. తెలిసికొనఁదగినది అదియె. దానిఁ దెలిసి కొనినవానికి జననమరణరహితమగు అమృతత్వము సిద్ధించును"

"జ్యోతిరాత్మని నాన్యత్ర సమంతత్ సర్వ జంతుషు
స్వయంచ శక్యతే ద్రష్టుం సు సమాహిత చేతసా"

"దైవజ్యోతి మనయందు ప్రకాశించుచున్నది. ఆ విధముగ నెల్లజీవములందుఁ బ్రకాశించుచున్నది. లెస్సగ నిగ్రహింపఁ బడిన చిత్తముగలవాఁడై జీవి దానిని మనోనేత్రమునఁ జూడఁ గలఁడు" అని వ్యాసమహాముని పలికినాఁడు.

"జ్యోతిషామపి త జ్జ్యోతి స్తమసః పరముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞాన గమ్యం హృది సర్వస్యవిష్ఠితమ్"
సకల తేజస్సులకును దేజస్సు నగుచుఁ
దమముకంటె బరంబని దాని నండ్రు
జ్ఞానమును, జ్ఞేయమును, జ్ఞాన గమ్యమగుచు
నవి ప్రాణుల హృదయంబులందు నుండు.

(భగవద్గీతామృతము. ౧౩-౧౭)

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం
వినశ్యత్స్వ వినశ్యంతం యః పశ్యతి స పశ్యతి॥

సకల భూతములందుండి, సమముగాన
శించువాని యందుండి నశింపకుండు
నట్టి పరమేశ్వరుండగు నాత్మ నెవఁడు
చూచు, నవ్వాఁడె లెస్సఁగాఁ జూచువాఁడు.

(భగవద్గీతామృతము. ౧౩, ౨౮)

కావున ఆదైవము సకలభూత హృదయాంతర్వర్తియై యున్నాఁడని మనము గ్రహింపఁదగును.

## సనాతన (ధర్మము) మతము.

"భగవాన్ వాసుదేవోహి సర్వభూతేష్వవస్థితః
ఏతత్ జ్ఞానంహి సర్వస్యమూలం ధర్మస్య శాశ్వతమ్"

సకలభూత హృదయాంతర్వర్తియై భగవానుఁడగు వాసుదేవుఁడు కలఁడు– అను ఎఱుక పొందుటే సనాతన ధర్మమునకు ఆధారభూతమగు సిద్ధాంతము దాని నాధారము చేసికొని యీ ప్రపంచమునందు వ్యాపించిన సకలమతములు– దాని రూపాంతరములే కాని, భిన్నములు– మతాంతరములు కావు. ఆస్తిక మతమే– దేవుడు కలఁడు– అను మతమే– సనాతన మతము ఏ మార్గమున నడచినను గమ్య మొకటే.

వేదవ్యాసుని "బ్రహ్మసూత్రములు"- సకల మత వాఙ్మయమునకు సారము. శ్రీమద్భగవద్గీతలా బ్రహ్మసూత్రములకు చక్కని వివరణము. ఈ కనబడు మతము లన్నియు బ్రహ్మసూత్రములలోఁ గనబడు మతమునకు రూపాంతరములే కాని, మతాంతరములు గావు. ఆయా మతాచార్యులాయా కాలపరిస్థితుల ననుసరించి ప్రజలలోని విరుద్ధప్రవర్తనల నరికట్టుటకు, సంఘమును క్రమబద్ధముగ నడిపించుటకుఁ గొన్ని నిబంధనల నేర్పఱచిరి. కాలక్రమమున అది మతకర్తల ఆశయములు విస్మరించి, మూలసిద్ధాంతముల సరకుసేయక, మతద్వేషములఁ బెంచుకొని ప్రజ లన్యోన్య హింసలకుఁ బాల్పడిరి. ఈమత పిపాసకులు "పరియంతి మూఢా అంధేనైవ నీయమానా యథాంధాః"- (గ్రుడ్డివాని నాధారము చేసికొని పోవు గ్రుడ్డి వారివలె మూఢులై ప్రవర్తించు చున్నారు) అను శ్రుతి వాక్యమునకు గురియగు చున్నారు.

"మతము"- అనునది మానవ కల్పితము. "దైవము కలఁడు"- అని చెప్పునది యే మతమైనను సాధుసమ్మతమే. ఈ ప్రపంచమున నే జాతికిఁ జెందినవారైనను తమతమ ఇష్టదైవమును నిర్ణయించుకొనుటలోఁ బరుల అధికార మిసుమంతయు లేదు. లోకములోని మతములన్నియు జ్ఞాన- భక్తి మార్గములని రెండు తెగలుగ విభజింపనగును. ఆ విధముగ వేదాంతులను ద్వైతులని, అద్వైతులని రెండు తెగలుగఁ బలుకవచ్చును. ద్వైతుల మతానుసారముగ పరబ్రహ్మను తెలియుట- అద్వైతుల మతానుసారముగ పరబ్రహ్మ రూపుఁ దగుట. ఈ రెండే వేదాంతసారము, వేదసారము పరమార్థము.

మిగత మతము లన్నియు నీ మతముల రెంటికిని నడుమ నుండు సాధకుల స్థితిగతులను తెలియఁ జేయునవి యని మనము గ్రహింపనగును.

వేదవ్యాసుఁ డా కారణముననే యిట్లు ప్రవచించెను.

"శ్రూయతాం ధర్మ సర్వస్వం శ్రుత్వాచా ప్యవధార్యతామ్
ఆత్మనః ప్రతికూలాని పరేషాం నసమాచరేత్
నతత్ పరస్య సందధ్యాత్ ప్రతికూలం యదాత్మనః
ఏషా సామాసికో ధర్మః కామాదన్యః ప్రవర్తతే"

సకల (మత) ధర్మ సారమును వినుఁడు. వినినదానిని లెస్సగఁ పాటింపుఁడు. నీకు ప్రతికూలములగువాని నితరులకుఁ గావింపకుఁడు. ఇతరులు నీ కేవి కావించిన కష్టము వహింతువో వాని నితరులకుఁ గావింపఁ దగదు. సంగ్రహముగ "ధర్మము" (మతము) అనుదానికి ఇది అన్వయమని గ్రహింపుము. తక్కిన మతములు ఏదో స్వార్థపరత తెరమఱుఁగునఁ గలిగిన వని గ్రహింపుము.

"జీవితుం యః స్వయం చేచ్ఛేత్
కథం సోఽన్యం ప్రఘాతయేత్
యద్య దాత్మని చేచ్ఛేత
తత్ పరస్యాపి చింతయేత్"

"బ్రతుకఁగోరువాఁ డన్యప్రాణము హరింప నెట్లు సాహసింపఁ గలఁడు? తా నభిలషించునవి యితరులకుఁ గూర్ప యోచించుచుండవలయును."

# దేవుని పొందుట ఎట్లు ?

ఎవరెవరే విధమున ఆ భగవంతునిఁ గూర్చి మనస్సున నెటులఁగి సాధన చేయుచున్నారో ఆ విషయమున వారెట్టి పరివర్తనము చేసికొనవలసిన అవసరము లేదు. నిశ్చితాత్ములై శ్రద్ధతో నా సాధనము చేయనగును.

"సాధకుల సాధనలలో నెట్టి పొరపాటులును లేవు. ఒక విధముగఁ జూచిన అన్నియు లోపములే. పరమాత్మ ప్రాప్తి కెవరే మార్గమును విశ్వసింతురో వారామార్గమున నడుచుచున్నారు. అందెట్టి లోపము లేదు. ఎవఁడే వస్తువు సాధ్యము- ధ్యేయము అని తలంచి దాని ప్రాప్తికై సాధన చేయునో వాఁడా సాధ్యము - ధ్యేయముకంటె పరమాత్మ స్వరూప మత్యంత విలక్షణమైనదని యెఱుఁగ వలయును. ఎటులఁగి ధ్యానించి సాధన మొనర్చు వాని కది ధ్యేయమగు పరమాత్మను సూచించు సాంకేతిక లక్ష్యము మాత్రమగు చున్నది. ఎంతవరకు ధ్యేయప్రాప్తిలేదో అంతవరకు అన్నియు లోపములే" - అని తత్త్వజ్ఞులు వచింతురు. కాని, "ముందుగా లోపములన్ని తొలఁగించుకొని పిదప సాధన చేయుదము"- అని మాత్రము తలంచరాదు. లోపముల సరిచేయఁ జాలిన వాఁడు లేఁడు. సత్యవస్తువు ప్రాప్తించిన పిదపఁ దనకుఁ దానే లోపముల సరిచేసికొనఁ జాలును. తొలుత నేమి తలంచు చున్నాఁడో అది ఊహామాత్రమే అగుచున్నది. అట్టి ఊహతోనే లవముచేయఁదుచున్నదో అది వాని ధ్యేయవస్తు ప్రాప్తికి సరియగు సహాయ మగుచున్నది.

శుద్ధవిదియనాటి చంద్రరేఖను జూచినవాఁడు అది కనఁబడనివానికి ఎఱుకపఱచు విధము గమనింపుము. "నీవు సూటిగా ఆ వృక్షమును చూడుము. ఆచెట్టు పై భాగమున కొంచెము ఎత్తున చూడుము. నీకు చంద్రరేఖ గోచరించును"— అనును. వాఁడు ఆచెట్టుపై దృష్టి నిలిపి చూచును. పిదప చంద్రరేఖను జూచి సంతోషించును. చంద్రునిఁ జూచినవాఁడు చూపనివాని కన్నులలో ప్రవేశించి చూపుటలేదు. చంద్రుఁడా చెట్టుపై నాలుగంగుళముల ఎత్తున లేఁడు. ఆ చంద్రమండలము వాఁడు చూచునంత చిన్నదియు కాదు. కాని లక్ష్యము నిలిపి దానిని జూడఁగలుగుచున్నాఁడు. చంద్రుని వాస్తవ రూపమున కేవియు సరికావు. ఎవరికిని బోధపడదు. ఏమైనను చంద్రుని ప్రకాశముండనేయున్నది. చంద్రుని నిజస్వరూపము— గుణములు కనఁబడు చంద్రరేఖయందు బోధపడవు. ఈ విధముగ లక్ష్యము చేసికొని చూచుటవలన భగవంతుఁడు తెలుఁగఁబడుచున్నాఁడు. చంద్రునకు లక్ష్యమునకు ఎట్టి అంతరము గలదో భగవంతుని సత్యస్వరూపమునకు లక్ష్యమున కట్టి అంతరము గలదు. దైవము వాక్కునకు సంబంధించిన విషయము కాదు. అది పొందఁబడినపుడే ఆ పరవస్తు వెలుఁగఁబడుచున్నది. ఇట్టిదని యూహించుటకును సాధ్యముకానిది.

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అని శ్రుతులు తెలుపుచున్నవి. ఆ భగవానుఁడు మనస్సుచే నూహించుటకు— వాక్కుచే వివరించుటకు సాధ్యపడువాఁడు కాఁడు. కాని లక్ష్యముచే ధ్యానించి ఆ వస్తువును పొందువారు తెలిసి

కొనుచున్నారు. సాధకుఁడు తానవలంబించు మార్గము మార్చుకొనవలసిన యవసరము లేదు. దానినే దృఢము చేసి కొనుట తగును.

## భగవంతు నెట్లు ధ్యానించవలయును

భగవానుని సాకారునిగ లేక నిరాకారునిగ ఎట్లు ధ్యానించినను ఫలము సమానము. కాని సాకార ధ్యానము కంటె నిరాకార ధ్యానము మిక్కిలి కష్టమని శాస్త్రములు తెలుపుచున్నవి. ఫలము రెంటను సమానమే. కేవల సాధనము నందు మాత్రము భేదము కలదు. సాకారోపాసకుఁడు నిరాకారుఁడు సర్వవ్యాపకుఁడగు ఈశ్వర తత్త్వ మంతెరిగి చేయవలయును. దేహాత్మబుద్ధి గలవారికి (దేహామే తానను తలంపు గలవారికి) నిర్గుణ నిరాకార పరబ్రహ్మోపాసనము మిక్కిలి కష్టమని శ్రీకృష్ణపరమాత్మ పలికినాఁడు.

"క్లేశోఽధికతర స్తేషామ వ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భిర వాప్యతే.
అటుఁ, నవ్యక్త చేతమలైనవారి
కధిక కష్టంబు గలుగు; దేహాభిమాన
యుతుల కెందు నవ్యక్తమౌ గతి విశేష
కష్టమునఁగాని లభ్యంబు గాదు పార్థ!

కొందఱు శుద్ధ నిరాకార బ్రహ్మమును ధ్యానింతురు. కొందఱు సాకారునిగ ధ్యానింతురు. వాస్తవముగ భగవానుఁడు శ్రీవిష్ణువు, శ్రీరామచంద్రుఁడు, శ్రీకృష్ణుఁడు ఎట్లు పలికెనో

యగుచున్నాఁడో- ఆ విధముగ దేవి- శివుడు- గణేశుఁడు సూర్యుడును ఆ విష్ణువుకంటె భిన్నులు కారు. భగవానుఁడు వేదవ్యాసుఁడు అష్టాదశ పురాణముల నాయా దేవతస్వరూపములయం దభిరుచి గలవారలకై రచించి ఆయా పురాణములందుఁ జేర్కొనబడిన దేవతను సర్వోత్కృష్టునిగను, సృష్టిస్థితిలయకారణునిగ నిరూపించి రచించెను. నామరూప భేదములే కాని యిన్నియు నా పరమాత్మయే యని యెఱుఁగవగును. నామరూప భావనము సాధకుఁడు తన ఇచ్ఛానుసారము చేసికొనుచున్నాఁడు ఒకఁడు ఒక 'స్థంభము'ను పరమాత్మగా భావించి ధ్యానించునేని అదియు పరమాత్మ ధ్యానమగుచున్నది. అవశ్య మా లక్ష్యమునందు ఈశ్వరుని పూర్ణభావముంచవలయును.

"మయ్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా స్తేమే యుక్తతమామతాః "

అనఘచరిత ! చిత్తంబు నాయందు నిలిపి
సతత యుక్తాత్ములై మంచిశ్రద్ధ గలిగి
నన్నుపాశించు చుందు జనముల నిశ్చ
యంబుగా యోగిపుంగవులని తలంతు.'

(భగవద్గీతామృతము. ౧౨-౨)

నిరాకార ప్రభావము నెఱిఁగి సాకార ధ్యానము చేయుటయే ఆ భగవానుని ప్రాప్తికి ఉత్తమము- సులభమునగు సాధనమై యున్నది. ఎవరే సగుణము నెఱుఁగుదురో వారా సగుణ ధ్యానముచే అభ్యసింప వగును అన్నిటి ఫలము సమానము

ఆదిశంకరుడు తత్త్వరహస్యము నంతయు నొక శ్లోకమున కూర్చినాడు.

దేహబుద్ధ్యాతు దాసోఽహం- జీవ బుద్ధ్యాత్ త్వదంశకః
ఆత్మబుద్ధ్యా త్వమే వాఽహం ఇతిమే నిశ్చయామతిః.

(ఓ స్వామీ! దేహమే నేనను బుద్ధిగల యంతవరకు నీకు నేను దాసుడను. దేహబుద్ధి తొలగి జీవబుద్ధి గలిగిన నీవు అంశివి నేను అంశమును. ఆ జీవ బుద్ధియు నడగి ఆత్మబుద్ధి ప్రాప్తించిన నేనే నీవు. నీవే నేను. అని నా నిశ్చితాభిప్రాయము.) ఇది పరమార్థముగ పాఠకులు గ్రహింప నగును.

## భక్తుల కొఱకు భగవానుడేల సాకారుడగు చున్నాడు ?

పరమాత్మ సచ్చిదానంద ఘనుడు. నిత్యము అపారమగు రూపమున సకల విశ్వమునందు నిండియున్నాడు. అగ్ని నిరాకార రూపమున సకల వస్తువులందు వ్యాపించి యున్నది. ప్రకటనము చేయుటకు దగిన సామగ్రి నొకచోట చేర్చి సాధనము చేసిననే అది ప్రకటమగును. ప్రకటమైన పిదప నందుగల ఇంధనాది పరికరముల కొలది విస్తృతి పరిణామము నొందుచుండును. ఆ విధమున గుప్తరూపమున నంతట వ్యాపించియున్న అదృశ్య సూక్ష్మ నిరాకారుడగు పరమాత్మయు భక్తుని యిచ్ఛానుసారము సాకార రూపమున ప్రకటమగుచున్నాడు. యథార్థము విచారించిన అగ్నివ్యాపకతా ఉదాహరణము ఏకదేశీయమగును. కేవల ఆకాశ వాయు తత్త్వములు మాత్రమున్నచోట అగ్ని లేదు. కాని ఆప

మాత్మ సకల విశ్వమున పరిపూర్ణుడై యున్నాడు. పర మాత్మ వ్యాపకత్వము అగ్ని వాయు రాకాశముల వ్యాపకత్వము కంటె శ్రేష్ఠము విలక్షణ మైనది. పరమాత్మ లేని స్థానము లేదు. అట్లే విశ్వమున పరమాత్మయొక్క మాయ లేని ప్రదేశమును లేదు. దేశకాలాదులు కలదంతయు మాయయే. 'సంభవామ్యాత్మ మాయయా'-అని గీతయందు చెప్పబడినటుల మాయారూప సామగ్రి నాధారము చేసికొని యెందెందు గోరిన నందందే పరమాత్మ ఆవిర్భవించుచుండును జలమెచటగాదో అచట శైత్యముండును. అదినుంచును కలిగింపజాలియున్నది. పరమాత్మ (అతని) మాయలకలిమిని నీ విశ్వము సకల ముత్పన్న మగుచున్నది. అట్టియెడ పరమాత్మ ప్రకటమగుట కష్టమగు పని కాదు.

నిరాకార వ్యాపకత్వ మనిన అదియెప్పుడు సాధ్యమే. కాని. సాకార వ్యాపకత్వమున భగవంతుడు భక్తునకు మాత్రమే ఎఱుకపడుచున్నాడు ఆ భగవానుడు సర్వశక్తి మంతుడు. ఎట్లు భావించునో గమనించును. ఒక్కడ నేక ముగ-అనేకమున నొక్కడుగ దర్శన మీయగలడు. అది ఈశ్వరేచ్ఛ-అది విశుద్ధమైనది భక్తుని యిచ్ఛయు భగవానుని యిచ్ఛానుసారముగ నుండును.

"మద్భక్తా యత్రగాయంతి తత్ర తిష్ఠామి నారద" అనియు "సాధుల హృదయము నాయది - సాధుల హృదయంబు నేను" అని భగవానుడు పలికినాడు. అది యథార్థము

మనయందలియందు నిరాకార రూపమున నెట్లు అగ్నికలదో ఆ విధమున భగవానుఁడు సచ్చిదానంద ఘనరూపమున నెల్లర హృదయములంగలఁడు. కాని భక్తుల హృదయములు నిర్మలములగుటచే వానియం దతఁడు పరిస్ఫుటముగ ప్రత్యక్షమగుచున్నాఁడు. అదియే భక్తహృదయముయొక్క విశిష్టత.

"యద్యసి సర్వత్ర సమ స్తథాఽపి నృహరి స్తథాప్యేతే
భక్తాః పరమానందే రమంతి సదయావలోకేన"

"అఖిల భూతముల మురారి సముండునై
పరగుచున్నఁ దత్కృపావలోక
నమున భక్తవరులు రమియింతురు పరమా
నందుఁడైన యాముకుందు నందు."

(ప్రబోధసుధాకరము - అనుగ్రహ ప్రకరణము)

సూర్యప్రతిబింబము కట్టె- రాయి- దర్పణములందు సమముగనే పడుచుండును. స్వచ్ఛ దర్పణమునందు మాత్ర మది ప్రస్ఫుట మగుచున్నది. కట్టెయందు, రాతియందు ద్యోతకము కాదు. ఆవిధముగ భగవానుఁ డెల్లర హృదయములందున్నను భక్తులు కానివారి కాష్ఠపాషాణ సదృశ కఠిన మలిన హృదయములందు గోచరింపఁడు. భక్తుల స్వచ్ఛస్నిగ్ధ దర్పణ సదృశ శుద్ధ హృదయమునందు గోచరించుచున్నాఁడు. భక్తుఁడు ధ్యానమునందు పరమాత్మ నే విధముగఁ దలఁచుచున్నాఁడో ఆ విధముగ నతని హృదయమున నివసించుచున్నాఁడు.

భగవానుని ఏ రూపమును ధ్యానించినను అది విశ్వపూర్ణముగ భావించి ధ్యానించవలయును. సగుణ ధ్యానమును గూర్చి భక్తిమతాచార్యులు పలువురు పలువిధముల బోధించి యుండిరి. అందే విధము నాచరించినను పొందు ఫలము సమానమని సాధకులగు భక్తులు గ్రహింపవగును

ఏ విభున్ 'శివు' డంచు శైవులుధ్యానింత్రు, 'విష్ణు'వటంచును వైష్ణవులును, వినతి 'బ్రహ్మ' మటంచు వేదాంతులెల్లరు, 'బుద్ధు' డటంచును బౌద్ధచయము, అరయ 'కర్త' యటంచు నైయాయికుల్. మఱి 'కర్మ' మనుచు మీమాంసకులును,
'అల్లా' యటంచు మహమ్మదీయులు, నజస్రంబు 'అర్హ' త్తని జైన చయము.

ఆ విభుని సర్వరూపంబులైనవాని,
నాగమాతీత వైభవమునం దలరువాని
సాధు దీన సంరక్షణ సలుపువాని
సర్వసులభు 'సాయిప్రభు' సన్నుతింతు.
(శ్రీ సాయి మననము — తృతీయసర్గము)

ఓమ్

శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయినాథాయనమః

# సాయిబాబా కూడ దేవుడేనా ?

## ఉన్న దేవుళ్ళు చాలకనా ?

(సందేహ నివృత్తి)

## ద్వితీయాంశము

లోగడ వివరించిన విషయములను పరిశీలించిన సకల సృష్టిస్థితి లయకారుడు – సర్వవ్యాపి, సర్వాంతరాత్మయగు దేవుడొక్కడే యని గుర్తించితిమి. 'ఉన్న దేవుళ్ళు' – అని నామిత్రుండడిగిన ప్రశ్నలో నతని దృష్టియందు బహుశః మనహిందువులలో వేలువేలుగా బూజించి, సేవించి శ్రీవిష్ణు, శ్రీకృష్ణ–పార్వతీ–శంకర – శ్రీరామ – సత్యనారాయణ – గణపతి మొదలగు రూపములని భావించి యుండవచ్చును. ఇవి యన్నియు నొకే వస్తువనియు – ఆవస్తువును పలువురు పలు నామరూపముల వారివారి యిచ్ఛానుసారము కల్పించుకొనిరని తెలిసికొంటిమి. 'దేవుడు' – అని చెప్పబడువాడు వాక్కుచే బలుకుటకు మనస్సుచే నూహించుటకు నందని వాడనియు నెఱిగితిమి. కావున దేవుడు–భగవానుడు అని చెప్పబడు ఏవస్తువు గలదో అది నిర్గుణము నామరూప రహితము. ఇంద్రియగోచరమై భగవచ్ఛబ్దవాచ్యమగువస్తువు ఆదేవునియొక్క సగుణరూపమగును. కావున శ్రీవిష్ణు– శ్రీరామ శ్రీకృష్ణ పార్వతీ శంకర గణపతి బుద్ధాది వ్యక్తులు ఆ భగవానుని సగుణ రూపములు – (లేక) అవతారములు అని మనము గ్రహింపవలెను.

## అవతారములు:-

సర్వ వ్యాపకుఁడు - అగమ్యుఁడు-అగోచరుఁడు-మనో వాగతీతుఁడగు భగవానుఁడు-ఏకదేశగతుఁడు సుగమ్యుఁడు-గోచరుఁడు-మనోవాగ్వశుఁడగుచుండుట అవతారమూలము వనే. అవ్యక్తమైన స్థితినుండి వ్యక్తమగుటయే 'అవతరణము'-'అవతారము.' ఈశ్వరుఁడంతటను వ్యాపించియున్నను దయామయుఁడగుటచే దీనజనుల నుద్ధరించుటకు తన నిర్గుణస్థితినుండి యొకమెట్టు దిగి సగుణుండగును. ఇది యొకచోటఁ గాదు-ఒక కాలముననే కాదు. ఎప్పుడెప్పు డెక్కడెక్కడ అధర్మము ప్రబలి ధర్మమునకు హాని కలుగనున్నదో అప్పుడప్పుడు-అక్కడక్కడ భగవానుఁడవతరించును. సాధుజనుల నుద్ధరించి ధర్మమును మానవ సంఘమునఁ జక్కగ నెలకొల్పును

యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మ స్యతదా త్మానం సృజామ్యహం.
పరిత్రాణాయ సాధునాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగేయుగే.
ఎప్పుడెప్పుడు సద్ధర్మ మెడలుఁజెందు
నెప్పుడెప్పు డధర్మంబు వృద్ధిఁ బొందు
నప్పుడప్పుడ మేఘవాహన తనూజ।
యేను నన్ను ధరిత్రి సృజించుకొందు.
సకల సాధువులను సంరక్షణముఁజేయఁ
బాపజనుల నెల్ల రూపుమాప
జగతియందు ధర్మసంస్థాపనార్థంబు
యుగ యుగంబునందు నుద్భవింతు.

(భగవద్గీతామృతము. ౪-అ. ౭,౮)

దేశకాల భాషాభేదముల ననుసరించి ఆయా యవతారములను పలువురు పలు విధములుగఁ బలుకుచుందురు. అట్టి యాళ్వారావతారములందు హెచ్చుతగ్గులు పాటించుట తగదు. ఏ కారణమున నే పనులు నెరవేర్చుటకు భగవానుఁడవతరించునో అది పూర్తియైనతోడనే ఆ యవతార యుద్దేశ్యమగును. భగవంతునందుఁ జెప్పఁబడిన

'ఐశ్వర్యస్య సమగ్రస్య ధైర్యస్య యశసశ్శ్రియః
జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా'

సమగ్రములగు నైశ్వర్య ధైర్య యశశ్శ్రీ జ్ఞాన వైరాగ్యములనఁబడు నారు విధములగు సామర్థ్యములు అవతారమునందును గలవు. కాని ఆయా యవతారము చేయు కార్యముల నిర్వర్తింప ప్రకటమయ్యెనో అట్టి సామర్థ్యములనే ప్రదర్శించును.

సామాన్య దృష్టిలో "దేవుళ్ళు"- అని బహువచనముపయోగించుటలో ఈశ్వరశక్తి కొంచెముగనో గొప్పగనో ఏయే వస్తువునందు ప్రకటమైనను దానిని దైవముగ భావించు నాచారము మనకుఁ గలదు. మన పూర్వీకులు పంచభూతములను, సూర్యచంద్రాదులను, నర జంతు పశు పక్ష్యాదులలో శ్రేష్ఠములైన వానిని దైవసమానములని సేవించెడివారు. నేటికి నట్లు సేవించువారు కలరు. శ్రీకృష్ణుఁడు తనవిభూతినిఁగూర్చి

'యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా
తత్తదేవావ గచ్ఛత్వం మమతేజోంశ సంభవమ్'

శోభితంబు నగుచును విభూతి గలయది
బలము గలిగియున్న వస్తు సమితి
నరః యెఱుంగుమయ్య! నాదు తేజోంశ సం
భవము అనుచు నీదు స్వాంతమందు.

(భగవద్గీతామృతము. ౧౦. ౪౧.)

తెలిపి "నా సంబంధములగు విభూతిబలసంపద లెందెందు గోచరించునో ఆ వస్తు సమూహము నా తేజోంశము వలన కలిగినవని తెలిసి కొనుము." అని శ్రీకృష్ణుఁడు పలికినాఁడు.

"ఈశ్వరుఁడు సర్వభూత హృదయాంతర్వర్తి" యని చెప్పఁబడెనుగదా? అట్టియెడ 'ఒక వ్యక్తి సామాన్యజీవి'- అని చెప్పనేల? అను ప్రశ్న కలుగవచ్చును. ఈశ్వరుఁడు సర్వవ్యాపి- పరమాణువు లోపల వెలుపలనైన విశ్వేశ్వరుఁడే.

"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః"

అనియే వేదములు పలుకుచున్నవి. కట్టెయందు అగ్ని కలదు అది కాష్ఠమందు లీనమై యంతటను వ్యాపించి యున్నది అందు లీనమైన అగ్ని ప్రజ్వలింపఁబడినప్పుడే ఆ కాష్ఠమును 'అగ్ని' యందురు. అంతవరకు అది 'కట్టె'యే కాని 'అగ్ని' కాదు.

"ఋజు వక్రం వా కాష్ఠం హుతాశ దగ్ధం సదగ్నితాం యాతి
తత్కింహా స్తత్ర హ్యాం ఋజువక్రాకార సత్త్వేఽపి,
ఏవం యః ఆత్మనిష్ఠో హ్యాత్మా కారశ్చ జాయతే పురుషః
దేహివ దృశ్యతేఽసౌ పరం త్వసౌ కేవలోహ్యాత్మా"

కట్టె సూటిదిగాని వంకరదిగాని
అగ్నియందునఁ గాలుచో నగ్ని యగును;
అందు ఋజువక్రరూపంబు లమరియుండుఁ
గాక - కరమునందునఁ బూనఁగాఁ దరంబె?

అటుల నాత్మవిష్ణుఁడగు పూరుషుండుఁ దా
నాత్మరూప మింకె యందుచుండు;
బాహ్యమునకు దేహివలెఁ దోఁచుఁగాని. య
థార్థ మతఁడు కేవ లాత్మ యగును.

(ప్రబోధ సుధాకరము - అద్వైత ప్రకరణము. 122-123)

"జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్"
జ్ఞాని యన ఆత్మయే యనినా మతంబు.

(భగవద్గీతామృతము. ౭-౧౮)

"బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి"
బ్రహ్మవేత్త బ్రహ్మమే అగును- అని శ్రుతులుపలుకుచున్నవి.
"తస్మిం స్తజ్జనే భేదాఽభావాత్"
'స్వామికి- తదీయులకు భేదమేమి లేమి'

(ప్రేమామృతము - నారద భక్తిసూత్రములు. ౪౧)

"సంత్ తోచ్ - దేవ్: దేవ్ తోచ్ సంత్ "
'సాధువే దైవము దైవమే సాధువు' అని తుకారాం పలికినాఁడు.

జ్ఞాని- బ్రహ్మవేత్త-భాగవతుఁడు-సాధువు-పరమాత్మ- వీరికి భేదము లేదు. జ్ఞానులగు సాధువులలో ఆత్మారాములై సంతత నిర్వికల్ప సమాధినిష్ఠులై యానందించువారు కొంద ఱుందురు. పరార్థ ప్రాణులు- దీన పతిత జనోద్ధారకులు సర్వ సమర్థులు. షడ్విధైశ్వర్య సంపూర్ణులు కొందఱుందురు. బ్రహ్మవిదుఁడు త్రిసత్యముగ బ్రహ్మ మగును. అతఁ డే దేశ మున నున్నను- ఏ భాషలో నేమి పలికినను అది 'వేదమే' అగుచున్నది.

## ఈశ్వరుఁడు శ్రీసాయిబాబాగా అవతరించిన కారణములు

(1) మన దేశమున ప్రధాన మతములు రెండు. హిందూమతము- మహమ్మదీయమతము. ఈ రెండుమతముల వారు పరస్పర ద్వేషము పూని నేటివరకు నెట్లొండొరుల హింసించుకొనుచున్నారో మనము చూచుచున్నారము. ఈ యిరు మతస్థులయందుఁ గల ద్వేషభావ మడఁచి మన దేశమున మనుష్యసమాజమున శాంతిభద్రతలను ధర్మమును నెలకొల్పుటకే ఈశ్వరుఁడు 'సాయీబాబా'రూపమున నవతరించినాఁడు.

"ఇరుమతములు సమమేకము భేదము- ఇరువురదైవము నేనే. సత్యము పోరపడి కలహింపఁబోలదు మీకని- సరిదిద్దినాఁడవు సాయీఅవతార! (శ్రీ సాయీనాథ త్రికాలసేవ- మధ్యాహ్న సేవ) జయదేవ! జయదేవ!

పూర్వమున హైందవ మహమ్మదీయ సఖ్యతఁ గూర్చి సంఘమునుద్ధరించిన కాశీరామానందయోగి- కబీరులు ఇరువురు శ్రీగోపాలరావు దేశముఖ్ (వేంకుశ) సాయీబాబాలుగ అవతరించి ఈశ్వరప్రేమ- పరార్థప్రేమ జీవులపై ప్రసరించి వారి కార్యక్రమము సంపూర్ణముఁ గావించిరని చెప్పుచున్నారు. అదియు సత్యమైన విషయ మనుటకు సందేహము లేదు. ఒక ప్రసిద్ధ వ్యక్తి ఏ కార్యము నెఱవుటకై భూమిపై పొడముననో ఆపని ఆజన్మమున పూర్తి కావింపఁడేని, తన బిడ్డలపైఁ గల అవ్యాజప్రేమచే తిరిగి జనించి తాను ప్రారంభించిన కార్యమును సంపూర్తిఁ గావించును. మన వేద శాస్త్ర పురాణాదులఁ బరిశీలించిన నిట్టి సత్యము మనకు బోధపడ

గలదు. పరమేశ్వరావతారములం దట్టి అనుక్రమిత సంబంధము గోచరించును. మానవ సంఘమున నధర్మము నడంచి ధర్మము శాంతి నెలకొల్పుట ముఖ్యము. అట్టిపని నేయే నామరూప ముల నేయే వ్యక్తి సాధించిన శాంతి ధర్మముల స్థాపించినను అట్టి వ్యక్తి పరమేశ్వరావతారుఁ డగుచున్నాఁడు.

శ్రీ సాయినాథావతారమున దుష్టసంహారమునకంటె దుష్టహృదయ పరివర్తనమే విశేషము. శ్రీ సాయిప్రభువు సందేశము గమనింపుడు. "ప్రేమ విశ్వాసములు సాధనము లుగ ఎల్లరు తరింపఁ జూడుఁడు. మీరు ఈశ్వరుని ఏ పేరునఁ బిలిచినను ఏ మూర్తిని ధ్యానించినను లోపములేదు. ఏ మత మవలంబించినను హానిలేదు. మీ మతమునుండి మార్పునొంద వలసిన అవసరము లేదు. అన్ని మతములు ఈశ్వరునిఁ జేర్చి తీరును. సామరస్య సమన్వయములుమాత్ర మవసరము. అవి లేనినాడు పతనము తప్పదు. ఎవరి ఆచారముల చొప్పున వారు నడువవచ్చును. ద్వేషభావము వీడుఁడు. రాం-రహీములు- కృష్ణ-క్రీస్తులు ఒకరేకాని భిన్నులు కారు"- అని బాబా మనకు విస్పష్టము చేసినాఁడు. అన్ని దైవ రూప ములు తానే యని శ్రీసాయిప్రభువు ఆత్మలీలలఁ బ్రకటించి నాఁడు. అట్టి లీలలను గాంచి ఆనందించిన భాగ్యశాలురు (దానగాణూ మహారాజు మొదలగువారు) నేటికినిఁ గలరు.

## రెండవ కారణము

(II) శ్రీ సాయినాథుని అవతారమునకు మఱియొక కారణము గలదు. తక్కిన మతములవారి విషయము లటుండనిండు. మన హిందూమతమున వేదశాస్త్ర పురాణేతిహాసములు మనకు ప్రమాణ గ్రంథములు. అందు వివరింపఁబడిన అంశములను చక్కగ బోధపఱచుకొనక "భగవంతుఁడన శ్రీ నారాయణుఁడో - శ్రీ శంకరుఁడో కాని మఱియొకరు కారనియు, ఆ భగవానుఁడు శంఖ చక్ర గదా పద్మములు ధరించిన చతుర్భుజములతోఁడ, కిరీటమణికుండలములు-పీతాంబరములు దాల్చి గరుడవాహనారూఢుఁడై దర్శనమిచ్చును; లేదా గంగాజటాజూట సర్పభూషణములతో త్రిశూల డమరుకాదులఁ బూని గజాసురాంబరధారియై వృషభవాహనారూఢుడై దర్శనమిచ్చునే కాని ఒక చినిఁగిన కఫ్నీతో-తలకొక గుడ్డచుట్టుకొని పేద ఫకీరువలె దర్శన మీయఁడు" అను అభిప్రాయము మనలో కలదు. "ఈశ్వరునకొక నియామక రూపము లేదు. ఏరూపముననైనను వ్యక్తమై తన లీలలను ప్రకటింపఁ గలఁడు. దీనులఁ బతితుల నుద్ధరింపఁ గలఁడు." అని తెలుపుటకే భగవానుఁడు "సాయిబాబా" రూపమున నవతరించెను. శ్రీసాయినాథుని ఈశ్వరునిగఁ దెలిసికొనఁ జాలినవాఁడు వీధియందే బిచ్చగానినిఁ జూచినను వానియందు నిరసన భావము వహింపజాలఁడు. ఎల్ల ప్రాణులయందు ఆదరణ ప్రేమలు గలిగించుటకు-ద్వేషబుద్ధి శమింపజేయుటకు, తామే సంపన్నులము - అధికారులము-విద్యావంతులము - ఉన్నత

వంశ జాతులమను అను దురహంకారముల—పాశ్చాత్యనాగర కతా వ్యామోహముల - రూపుమాపుటకే అవతారపురుషుడు శ్రీసాయీ ప్రభువుగ, నవతరించినాడు విశ్వమానవప్రేమ - సర్వభూతహితాసక్తి బోధించు అవతారము శ్రీసాయీ నాథావతారము.

శ్రీరామ-శ్రీకృష్ణ-గౌతమ బుద్ధాదులు ఈ విషయములు మనకు దెలుపలేదా - ఇందేమి విశేషము కలదు ? అని తలంపఁదగదు. మన శ్రుతి స్మృతి పురాణాదులు పరిశీలించిన చెప్పిన విషయమే వేరువేరు వ్యక్తులచే వేరువేరు విధములఁ జెప్పబడుట విశదమగును. ఇందు పునరుక్తి దోషము గాని మఱియొట్టి న్యూనతగాని లేదు. ఇన్ని చదివియు, వినియుఁ బాధియు మన మజ్ఞానము నేచరించుచున్నారము. భగవానుఁడు కరుణాసింధు. తన బిడ్డలయందపార ప్రేమగలవాఁడు. బిడ్డలు చక్కఁ బడుటకై బోధించి లంచమిచ్చి, కోపించి, దండించి ఎన్నెన్నో విధముల బుద్ధిఁ గఱపుచుండును. "సంభవామి యుగేయుగే"- అనుటలో అవసరము కలిగినపుడెల్ల దేవుఁడవతరించును. మన జీవితమున ప్రతిక్షణము జరుగు పనులయందు భగవంతుఁడెట్లు తన అభయహస్తము మనపై ప్రసరింపఁ జేయుచున్నది మనము చూచుచునే యున్నాము. ఎఱిఁగియు మఱుక్షణమున ఈశ్వరమాయ కలీనుల మగుచున్నారము.

(శ్రీ సాయీకరుణ - పీఠిక చూడుడు) (కరుణ - మాయ)

శ్రీ సాయినాథుఁడు తన చరమదశయందు అనగా చివర పదునెనిమిది సంవత్సరములందు (1900–1918) తన అద్భుత లీలలను ప్రకటించినాఁడు. గొప్పగొప్ప విద్యావంతులు సైతము బాబా యెదుట మోకరిల్లిరి. బాబాను పరీక్షింప జూచినవారలు విఫలులైరి. ఆశ్రయించినవారల కెల్లరకు 'శ్రీసాయి' 'అంతర్యామి' - అను సత్యము బోధపడినది ఆయా దేవతోపాసకుల కాయా దేవతారూపముల బాబా దర్శన మిచ్చెను. ఎల్లరు పాదాక్రాంతులైరి. తన బిడ్డల అజ్ఞానమున కాగ్రహించినవాఁడు కాఁడు. ఆతండ్రి పరమ దయాళువు,కొండొక కారణమున తనవారిపై ఆగ్రహించినను వైశమవారికి ప్రబోధ కల్పించి, అనుగ్రహించినాఁడు. చేరదీసినాడు.తనఆశ్రితుఁ డెక్కడెక్కడనున్నను ఏమిచేయుచున్నను వేయికన్నులఁ గనిపెట్టి రక్షణ మొనంగువాఁడు.

ప్రారబ్ధ దుష్కర్మ వశులై శ్రీ సాయీ ప్రభువును నిరసించినవారును కలరు. బాబా ప్రదర్శించిన లీల లన్నియు గారడీల - ఇంద్రజాలికుల చమత్కారములుగ దలంచిరి. శ్రీకృష్ణాద్యవతారములందును పరమాత్మ ప్రదర్శించిన లీలల నా విధముగనే అప్పటివారు అసురభావ మాశ్రయించిన వారలై నిరసించినట్లు పురాణాదులందుఁ జెప్పబడినవి.

"అవజానంతిమాం మూఢా మానుషీం తనుమాశ్రితం
పరంభావమజానంతో మమ భూతమహేశ్వరమ్"
అఖిలభూత నియామకమైన వాడు
పరమ భావంబు నెఱుఁగని వారలగుచు
నరశరీరంబుఁ బొందిన నన్ను మూర్ఖ
జనము లవమానమును జేతు రనఘచరిత !

(భగవద్గీతామృతము - ౯-౧౧)

అని శ్రీకృష్ణుఁడు పలికినాఁడు. అవతార రహస్యము తెలియుఁగుట మిక్కిలి కష్టము. మానవుల బుద్ధులు లోకవాసనా కళంకితములు. కావున సత్యవస్తువు నెఱుఁగఁజాలరు. ఎఱుఁగఁ బ్రయత్నించనూ లేరు. చక్కని పూర్వజన్మసుకృత ముండినగాని భగవదనుగ్రహము ప్రాప్తముకాదు. అదిలేనిది సాధుజనానుగ్రహము గలుగదు. అదికలిగినఁగాని జీవి జనన మరణ చక్రభ్రమణమునుండి విడివడలేఁడు. (శ్రీ సాయీమననము పీఠికచూడుఁడు)

## మూఁడవ కారణము.

(iii) 'బినా సద్గురు కోన బతావై'-'గురు కరుణ లేని యెడ మార్గ మెఱుకపడదు'- అనినాఁడు కబీరు

మఱియొక సందర్భమున

"నరనారాయణ హో తహై - జో కరిబూఝై కోయ్
కీటక భృంగీ హో తహై - గురు బలిహారీ తోయ్"

గురు కృపాలబ్ధికిఁ గుదురైనవాఁడు
పరమమౌ జ్ఞానసంపదఁ గాంచువాఁడు
పరుఁడయ్యు నారాయణత్వంబుఁ గనెడు
పురుగు భృంగత్వంబుఁ బొందుటఁ గనుఁడు,

(సా. క. సూక్తులు)

"జీవో బ్రహ్మైవనా ఽపరః" అని, ఆదిశంకరుఁడు పలికెను.

ఏదేని నొక విషయము మన మితరులకు బోధించు పూర్వము దానిని మన ఆచరణమునందుంచుకొని మన స్వానుభవమును మాటలతోఁగాక క్రియారూపమునఁ బ్రకటించవలయును. సామాన్య మానవుఁడు ఏ విధముగ దైవత్వస్థితి

పొందఁజాలునది ఆ పరమేశ్వరుఁడు శ్రీసాయిబాబాగా అవతరించి, ఆచరించి, ప్రదర్శించినాఁడు. శ్రీరామావతారమున పరాత్పరుఁ డాచరించిన ధర్మాచరణము శ్రీకృష్ణావతారమున బోధించినాడు. ఆచరణ పూర్వకముగ ప్రకటింపనిదే యితరులకు బోధింపఁ జూచువాఁడు లోకవంచకుఁడు.

ఒక విషయము గమనింపుడు. క్రింద మంట- పైన నీరు. ఈ రెంటికి మధ్య పాత్ర లేనిదే నీరము కాఁగఁబెట్టలేము. మధ్యపాత్ర లేనియెడ నీరెక్కువైన నిప్పు చల్లారును. నిప్పెక్కువైన నీరమావిరి యగును. అట్లే దైవము- మానవుని మధ్య సమర్థ సద్గురువు ఆధారము. దైవము అందుబాటునఁ గల దైవత్వము- మానవున కందుబాటైన మానవత్వము కలిగియున్న సద్గురువే సాధారణ మనుష్యుల నుద్ధరింపఁ గలఁడు. మానవునియందుఁ గల జడతను మాన్పి దైవత్వస్థితి ప్రాపింపఁ జేయఁగలఁడు. ఈ సత్యమును ప్రపంచమున కెఱుకపఱచుటకే శ్రీ సాయినాథావతారము బాబా పుట్టుక మొదలు తుదివరకు గల జీవిత చరిత్రను సావధానముగ మనము గ్రహించిన ఈ సత్యము విశదము కాఁగలదు.

'అమాచా ఘరాణే నిరాళా ఆహే'- మా పద్ధతులు ప్రత్యేకములు. "మీ కానాలా ఇన్ కా రాగునహీ గ్"- నేను చెవిలో నుపదేశించునది లేదు- అని బాబా పలికినాఁడు. తన గురువు తన్ననుగ్రహించిన విషయముఁ దెలుపుచు- కేవలము గురుకృపావలోకన ప్రభావముననే తన కట్టి స్థితి ప్రాప్తించెనని యథార్థముపలికినాఁడు. (సా. చరిత్ర పుటలు ౪౧-౪౯)

సమర్థ సద్గురువు మహాత్మ్య మెట్టిదియో మనము ముందుగఁ దెలిసికొనవలయును. తెలిసికొనిన ఆ వస్తువు నాశ్రియింపవలయునను బుద్ధి పొడముకు. ఆ వస్తువునందు తొలుత భయమేర్పడును. ఆభయము (దైవభీతి) లేనిదే భక్తి సుస్థిరము కాదు. ఆ భక్తి క్రమక్రమముగా పరస్పరానురాగముగ- ప్రేమగ- పరిణమించును. ఆ ప్రేమ యెంతెంత పెంపొందునో గురువు- తదాశ్రితుఁడు అంతంత సన్నిహితు లగుదురు. తుదకైక్యస్థితి నొందుదురు. బాబా అవతారమున బోధపడు పరమరహస్య మిదియే. ఆ తండ్రి ఆచరించి చూపి మనకు బోధించినాఁడు పూర్వసుకృతముగల జీవి బాబాను ఆశ్రయించి తరించును. శ్రీ సాయిప్రభువు తన బిడ్డల వలన కోరునది- 1. నిష్ఠ (విశ్వాసము) 2. సబూరి (ధైర్యముతోఁగూడిన ఓర్పు) ఈ రెండు నాణెములను బాబాకు సమర్పించి శరణాగతిఁజేసిన జీవి సకల భారము లా తండ్రి వహించి తనవాని క్షేమకర మార్గము నడిపించి గమ్యమును జేర్చును.

శ్రీగురు పాదరాజీవముల్ మ్రోల
సాగిలఁ బడి నతుల్ నెఱపు వేవేల,
కనఁగఁజాలద కీటకంబు లేశంబుఁ
దనకు సామ్యముఁ జేసి తనుపు భృంగంబు.

ఓమ్

శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయినాథాయనమః

# సాయిబాబా కూడ దేవుఁడేనా?

## ఉన్నదేవుళ్ళు చాలకనా?

(సందేహ నివృత్తి)

## తృతీయాంశము

సాయిబాబాకూడ దేవుఁడేనా? అను ప్రశ్నమును గూర్చి పలుకుపూర్వము బాబా జననాదికమునుగూర్చి సంగ్రహముగఁ దెలిసికొనుట అవసరము. (శ్రీ సాయిబాబా సంపూర్ణ చరిత్రము - భక్తుల అనుభవములు - "ఏమీ, నిన్ను పేక్షింతునా?" అను గ్రంథమునఁ దెలుపఁబడినవి. బాబా అనుగ్రహించిన త్వరలోనే సోదరభక్తుల కందింప ప్రయత్నింతును.)

బాబా జననాదికములఁగూర్చి మనకు సరిగా తెలియదు. తన చరమదశయందు 1910 ప్రాంతమున బాబా తన ఆంతరంగిక భక్తుఁడగు మహాల్సాపతికిఁ దెలిపిన విషయము ననుసరించి, దాస గణూమహారాజు - హేమాద్రిపంతు - ఖపర్డే మొదలగు బాబాభక్తుల రచనలననుసరించి యీవిధముగఁ దెలియవచ్చుచున్నది.

నైజాము రాష్ట్రమున పార్వణి తాలూకా మన్వాత్ సమీపమునగల 'పత్రి' అను గ్రామమున బ్రాహ్మణ దంపతులకు 1838 సంవత్సరమున బాబా జనించెను. (ఒక చరిత్రకారుడు బాబా జననీ జనకులు జమునాబాయ్ నందలాల్ అని వ్రాసినాఁడు. అది యెంతవరకు నమ్మఁదగినదో తెలియదు.) ఆతలిదండ్రు లాబిడ్డను

రెండవయేట నొక ఫకీరున కొప్పగించిరి. ఫకీరుదంపతు లా బిడ్డను 5 సంవత్సరములు సాకిరి. వారి పోషణమున నున్న బాబాకు అతి బాల్యముననే చక్కని ప్రవర్తన యలవడెను. ఫకీరు తన అవసానకాలమున నాబిడ్డను సేలు గ్రామమున నున్న గోపాలరావు దేశముఖ్ దగ్గఱ విడిపింపు మని తన భార్యతోఁ జెప్పి మరణమొందెను.

మహారాష్ట్రదేశమున పీష్వాలకు సామంతుఁడై జింతూరు పరగణాకు జమీందారుగ గోపాలరావు 1800 ప్రాంతమున నియమింపఁ బడెను. అతఁడు శ్రీవేంకటేశ్వర భక్తుఁడు. వైరాగ్య జ్ఞాననిష్ఠుఁడు. సకల సిద్ధులాతని వరించినవి. ఆయన వేంకటేశ్వరావతారుఁడని ప్రజలు ఆ ప్రభువును సేవించిరి. ఆయనను "వేంకుశుఁడు" అని పిలుచువారు.

ఫకీరు కాంత తన భర్త యానతిచొప్పున ఆరేండ్ల బాలుఁడగు బాబాను సేలునకు గొనివచ్చి గోపాలరావు దేశముఖ్‌నకు సమర్పించెను. శమదమాదులు - సత్యదయా శాంతి ప్రముఖ సుగుణము లా గోపాలరావునందు మూర్తీభవించినవి. బాబా తన గురువగు వేంకుశుని మిక్కిలి శ్రద్ధాభక్తులతో పండ్రెండు సంవత్సరములు సేవించెను. గురువు కృపాకటాక్షవీక్షణము మాత్రమున సకల సద్గుణ సంపద-సకల సిద్ధులు అనుగ్రహపాత్రుఁడగు బాబాయందు పాదుకొనినవి. దీనినే 'శక్తినిపాత' మందురు.

బాబా మొదటిసారిగా శిర్డికి 1854 నఁ జేరెను. పదు నెనిమిదేండ్ల వయసు గలిగి బ్రహ్మవర్చస్సు ముఖమున తాండవింప మౌనియై యెల్లవేళల ధ్యాననిష్ఠ యందుండెడివాఁడు. మధురనింబ వృక్షముక్రింద కొలఁది దినములుమాత్రముండెను. తరువాత 4 సంవత్సరము లెక్కడ సంచరించెనో తెలియదు.

**'సాయీ-బాబా'-నామకరణము.**

రెండవసారి బాబా 1857 సంవత్సరమున దూప్ ఖేడా నుండి చాంద్ భాయి పటేలు వెంట పెండ్లి బంధువులతోఁ గలసి శిర్డికిఁ జేరెను. ఊరివెలుపల మఱ్ఱిచెట్టుక్రింద పెండ్లివారు బండ్లు నాపిరి. అచట ఖండోబా దేవాలయము కలదు ఆ కోవెల ధర్మకర్త 'మహాల్సాపతి' విశ్వబ్రాహ్మణుఁడు- గుడియందు కూర్చుండెను. చాంద్ భాయి, యువకుఁడైన బాబా-యిరువురు బండిదిగిరి. బాబా దివ్యసుందరవిగ్రహముఁజూచి మహాల్సాపతి ఆశ్చర్యచకితుఁ డయ్యెను. తల కొక గుడ్డచుట్టుకొని కుఫ్నీ ధరించిన బాబా ఒక్క మహమ్మదీయ బాలుఁడని ఆతఁడు తలంచెను. ఆ బాలుని చూచిన తోడనే మహాల్సాపతి నోటినుండి అప్రయత్నముగ "యా-సాయీ! బాబా!; యా! సాయీ! బాబా!" (స్వాగతము! సాయీబాబా! స్వాగతము! సాయీబాబా!) అను మాటలు వెలువడెను.

అది ఈశ్వరేచ్ఛ! ఆ నామ మహత్త్వ మెట్టిదియో! మహాల్సాపతి నోటినుండి వెలువడిన యీ నాలుగు దివ్యాక్షరముల సంపుటి నేడు లక్షలు కోట్ల జనులకు భవతారక

మహామంత్రమైనది. *సంస్కృతభాష యందలి 'స్వామి' శబ్దమునకు హిందీ వికృతి 'సాఈ' - 'సాయీ' అందుచేతనే 'గోసాయీ' - 'గోస్వామీ' - శబ్దములు ప్రసిద్ధములైనవి. అవతారపురుషుఁడు - సమర్థసద్గురువగు బాబాకు 'సాయీ బాబా' అని నామకరణముచేసిన మహాల్సాపతి మన కెల్లరకు వందనీయుఁడు. ప్రాతఃస్మరణీయుఁడు. అచట నున్నవారందఱు ఆ సిద్ధవస్తువును - 'సాయీబాబా' - అనిగుర్తించిరి. ఆ క్షణము మొదలు ఆ పేరుననే యెల్లరు ఆ మహనీయునిఁ బిలువ నారంభించిరి. శిర్డి యందవతరించిన పరతత్త్వము 'సాయీబాబా' - అను ప్రసిద్ధనామమున జగద్వ్యాప్తి నొందినది. 'సాయీ' - (స్వామి) జగత్ప్రభువు. 'బాబా' - జగత్పిత (ప్రేమతో తండ్రిని సంబోధించు పదము) అను అర్థము కలది కావున జగములకు ప్రభువు-తండ్రి యెవఁడైయున్నాఁడో ఆ వస్తువే 'సాయీ బాబా' అని పాఠకులు గ్రహింపఁ దగును.

## నామము - నామి :-

పరమేశ్వరావతారము లన్నియు శ్రేష్ఠములే. కాని, యొక్కొక్క అవతారమునందు ప్రత్యేకించి విశేషము గలదు. అందలి నామరూపములు ప్రాధాన్యములు. శ్రీరామ శ్రీకృష్ణా ద్యవతారములందుబలె శ్రీసాయీ అవతారమునందు నామ- నాము లక్కట్టి మహాత్మ్యము కలిగినది. అట్టి ప్రాశస్త్య మొనర్చినది కాదు. అది శాశ్వ రేచ్ఛ. నామికంటె నామమున అద్భుతశక్తి కలదు. నామి చేకూర్పఁజాలనిది

* సాయీశబ్దనిర్వచనము, 'శ్రీ సాయీమననము' గ్రంథమునఁ జూడుఁడు.

నామము చేకూర్పఁ గలదు. సాకార బ్రహ్మము- నామి- అవతార సమాప్తినొంది అదృశ్యమైనను 'నామము' మాత్రము చిరస్థాయిగ నిలుచును. నామి యందున్న శక్తుల కంటె నామమునం దధిక శక్తులు గలవు. నామబలమున నామి ఆకర్షింపఁబడును. నామి కంటె నామమే జీవిని ఘోరసంసార పారావారమును దాటింప సమర్థమైనది. శాబరమంత్రములు పరికించితి మేని అందలి యర్థము మృగ్యము. కాని అందలి మహత్త్వ మత్యద్భుతము. ఆ బీజాక్షరసంపుటీకరణ మాహాత్మ్యమమోఘము - అతి బలీయము.

ఇది సాయిబాబా అవతారవిశేషమో - లేక గురువైన శ్రీ వేంకుశుని అద్భుత మహిమయో మన మెఱుఁగఁజాలము. సాకారుఁడై శిర్డి యందు పొలిచిన పరేశునికంటె - నామికంటె ఈ నామము- 'సాయిబాబా' అను నామమున అత్యద్భుత మాహాత్మ్యము కలదు. ఆ నామామృత మాస్వాదించిన వారికే అందలి మహత్త్వము విశదము కాఁగలఁదు. ఈ విషయమును దలంచియే శ్రీ సాయిస్మరణమున నిట్లు పలికితిని.

ఏ యయ్యల్ ముదమారఁగా నిడిరొ యీకీ పేరు; సుశ్రేయమై
ధ్యేయంబై, సకలార్థదంబయి, రసాధిష్ఠానమై, శ్రావ్యమై
హాయింగూర్పఁ దలంచినన్ వివిధ సౌరారం బవింపంగ నీ
'సాయీ' ద్వ్యక్షర మెల్ల జీవులకు విశ్వంబందు శిర్డీశ్వరా!
బాబా! 'సాయి' పదంబు ఏకతగు సర్వార్థాభిధానంబునై
ప్రాబల్యంబును గాంచు నెల్లెడ సమర్థంబౌను; సందేహమే
లా! బీజాక్షరసంపుటీకరణ మాహాత్మ్యం బగమ్యంబు, స
ద్భాగాహాత్మ్యమచింత్యమై పఱఁగు సంతత్యంబు శిర్డీశ్వరా!

## నామి - రూపము.

ఏ రూపమున సర్వేశ్వరుఁడు తన అద్భుత శక్తి సామర్థ్యములఁ ప్రకటించెనో - ఏరూపమున ఈశ్వర ప్రేమ ప్రపూర్ణమై వెల్లివిరిసినదో - ఏ రూపమున పరాత్పరుఁడు ఆశ్రితజనము ననుగ్రహించెనో ఆ రూపము జగత్ప్రభువు. జగత్పితయొక్క నిలయము. ఆ రూపము నఖశిఖపర్యంతము పవిత్రము-ఉపాస్యము - ధ్యేయము - సకలార్థప్రదము. కావున శ్రీసాయిబాబా రూపమును పటమునందు - ప్రతిమాదులందు నే విధమున ధ్యానించినను సేవించినను - పూజించినను భౌతిక తనువునందున్న బాబాను పూజించిన ఫలము ప్రసాదింప దక్షమైనదని పాఠకులు గ్రహింపనగును. సాధకులు బాబా రూపమును తమయందు సకల భూతములందు జూడ నభ్యసింప వలయును. బాబా బోధల నవగాహనము చేసికొని ఆచరణము నందుంచఁ దగును.

## సాయిబాబా - మసీదుఁ జేరుట.
## ద్వారకామాయి నామకరణము.

సాయిబాబా ఆ యూరి వెలుపల నున్న ఖండోబా దేవాలయమున నుండఁ దలంచెను. కోవెల ఆవరణములోనికిఁ ప్రవేశింపఁ బోయెను. తొలుదొలుత గౌరవ ప్రేమలఁ బిల్చి రప్పించిన మహాల్సాపతి - బాబా నొక మహమ్మదీయుఁడుగఁ దలంచి హిందవ దేవాలయములోనికి రాఁదగదని నివారించెను. ఖండోబాకు దూరమునుండి నమస్కరించి బాబా

అచట నుండి వెడలెను. శిర్డికి ఆవల దతిని శిథిలమైన మసీదు కలదు. దానికిముందు 4 సంవత్సరముల క్రితము బాబా నివ శించిన వేపచెట్టు (మధురనింబవృక్షము) కలదు. బాబా ఆ మసీదునందు ప్రవేశించెను. కొంత తడవు మసీదునందు - కొంతసేపు వేపచెట్టు క్రింద కాలము గడపెడివాఁడు. ఆ మసీదునకు 'ద్వారకామాయి' (ద్వారక అను పేరుగలతల్లి) 'మసూదిఆయి' (తల్లియైన మసీదు) అను ప్రసిద్ధి నొందినది. ఆ పేరు బాబా పెట్టినదే. ఎల్లరకు ఎల్లవేళలఁ దెఱువఁబడిన ద్వారములుగల నిలయమగు తల్లి - 'ద్వారకామాయి'. శ్రీ కృష్ణసాయికి ఆశ్రయ మొసఁగినది ద్వారకామాయి గాక మఱేమగును? తానే ద్వారకామాయిగ బాబా యొసఁగిన అభయములు.

(శ్రీ సాయీశరణ - 14, 15, 16 పుటలు చూడుడు)

బాబా శిర్డిఁ జేరిన మొదట నిలుకడగ నొకచోట నుండలేదు.

" ఆత్మారామో అనయవృత్త్యా విచరేజ్జడవన్మునిః"

(భాగ. XI - 11-17)

దైవమందు (ఆత్మయందు, లీనమైనవాఁడై ముని, మూఢునివలె సంచరించును)

ఆహార నిద్రలను లక్ష్యముచేయక ధ్యాననిమగ్నుఁడై సమీపమున గల అరణ్యములందు సంచరించెడివాఁడు. గ్రామములోని బాలురు మఱికొందఱు బాబాను పిచ్చివానిగ తలంచిరి. బాబాపై రాళ్ళు రువ్వినవారును కలరు. ప్రశంస ప్రశంసనములను సమముగ గ్రహించినవాఁడు బాబా. భిక్షు గీతములందుఁ దెలుపఁబడిన భిక్షువువలె సాయిప్రభువు ప్రవర్తించెను.

ఆ గ్రామము పెద్ద గణపతిరావు-పటేల్ కోతే. ఆయన సతి 'బయాజిబాయి' బాబాయొక్క దివ్యాకారముచే ఆకర్షితురైరి. తొలుత ఖండోబా దేవాలయ ప్రవేశమునకు అనుమతిం దెలిపిన మహాల్సాపతి ('భగత్'- అని బాబా పిలుచువాఁడు. భక్తుడు అని అర్థము) బాబాశిష్యులు- అంకితసంతతిలో ప్రప్రథముఁడు. మొదటినుండి యితు నాతఁడు బాబాను ఆశ్రయించెను. ఆయన మిత్రులు 'తుకారాం దర్జీ', 'అప్పాభిల్' అను ఇరువురుమాత్రమే బాబాయెడ భక్తి గౌరవములు ప్రకటించిరి తక్కినవారు బాబా నొక పిచ్చిఫకీరుగ తలంచిరి.

అన్నము తినక అడవులందు సంచరించు బాబాపై బయ్యాజిబాయి (పటేల్ భార్య) అత్యంత వాత్సల్యము ప్రదర్శించుచు వెదకుచు వెళ్ళి బాబాకు ఆహారము పెట్టుచీది. ఆయమ ప్రేమానురాగములు అసాధరణములు. ఆతల్లియెడ బాబాకును అధికాదరణము. తరువాత ఒక సందర్భమున- పూర్వజన్మమున నామెతనసోదరియని బాబా తెలిపెను. ఆ కారణమున ఆమె కుమారుఁడు తాత్యాపటేల్ బాబాను 'మామా' అని సంబోధించెడివాఁడు. మహాల్సాపతి-తాత్యాపటేల్ ఇరువురు బాబా కుడి - ఎడమ భుజము లని చెప్పఁదగినవారు.

ఒకటి రెండు సంవత్సరములు తరువాత బాబా అడవులందు సంచరించుట మానెను. శిర్డి గ్రామమున నిర్ణీతమకములగు నైదిండ్లకు భిక్షకై పోవువాఁడు. వారిచిన పదార్థములఁ దెచ్చి ద్వారకామాయి మసీదునందుఁ దినువాఁడు.

శిర్డీ యందును చుట్టుపట్టు గ్రామములనుండి వచ్చిన రోగులకు మూలికలతో సిద్ధముచేసిన ఔషధము లిచ్చి వ్యాధులు నివారించెడివాఁడు. ప్రతిఫలము కోరియెఱుఁగడు. ఇప్పటి సమాధి మందిరమున్న తావున నేల త్రవ్వి పూలచెట్లు - తులసి బృందావనము పెంచినాఁడు. నీటికై మసీదు దగ్గఱ నొకబావి త్రవ్వి ఆ నీరు చెట్లకుపోసి పెంచినాఁడు.

ద్వారకామాయి మసీదునందు ధుని (అగ్ని) ఎల్లవేళల బాబా ఉంచువాఁడు. తైలవర్తకులదగ్గఱకు వెళ్ళి నూనెఁ దెచ్చి రాత్రిళ్ళు మసీదున దీపములు వెలిగించువాఁడు. ఒక నాడు తైలవర్తకులు నూనెపోయక లేదనిరి. బాబా నీటితో ప్రమిదెలను నింపి వత్తులు తడిపి వెలిగించెను. నూనెపోసి నప్పటికంటె మిక్కిలి కాంతితో దీపములు వెలిగెను. ఆ రాత్రి బాబా యేమి చేయునో చూతమని వచ్చిన తైలవర్తకు లా దృశ్యముఁ గని భయపడి బాబా పాదములపైఁబడి క్షమింపు మని ప్రార్థించిరి. బాబా వారి ననుగ్రహించి కల్లలు పలికిన దైవమునకు దూరమగుదు రని నీతినిఁ గఱపి వారిఁ బంపెను.

హిందువులు బాబాను ఒక మహా సిద్ధపురుషుఁ డని "చల్ తే-బోల్ తే దేవ్" నడుచు పలుకు దైవము అని తలంచి సేవించిరి. మహమ్మదీయులు 'అవాలియా'' - పైగంబరు (ప్రవక్త) అని విశ్వసించి ప్రేమించినారు. గురుదేవుఁడని విశ్వసించి తొలుత గంధపుష్పాక్షతలతో బాబాపూజసలిపిన వాఁడు మహాల్సాపతి ఆతని ననుసరించి తక్కిన హిందువులు

బాబాకు మాత్ర మిష్టము లేదు. కాని యేమి చేయఁగలడు? భక్తపరతంత్రుఁడు. వారిభక్తిభావమునకు కట్టుబడి తన పూజ కంగీకరించెను. మహమ్మదీయుల కిది సరిపడకుండెను. కొందఱు దుండగులు మసీదులో బాబాను పూజించు హిందువుల మడియింప సిద్ధపడిరి. కాని, బాబాకు ఆగ్రహము కలిగింప నిష్టములేక తమ పూనికను విడచి వెళ్ళిరి.

## బాబా హైందవుఁడా? - మహమ్మదీయుఁడా?

ఈ ప్రశ్న తఱచుగ బాబాను జేరువారందఱకు పొడముచునే యుండును. మనకు లభించిన ఆధారముల ననుసరించియు బాబా స్వయముగఁ దెలిపిన విషయముల ననుసరించి బాబా హైందవ (బ్రాహ్మణ) దంపతులకు జన్మించినట్లు తెలియుచున్నది. దీనికి నిదర్శనముగ చెవులు కుట్టఁబడి యున్నవి. (చౌలము హైందవుల ఆచారము. కాని మహమ్మదీయుల ఆచారము కాదు).

లోగడ తెలుపఁబడినట్లు బాబా 2 సంవత్సరముల బిడ్డగా నున్నపుడే మహమ్మదీయ సంబంధము కలిగెను. బాలుఁడగు బాబాను పెంచిన ఆ ఫకీరు ఎవరైనది మనకు తెలియదు. అతఁడెట్టివాఁడైనది మాత్రము గ్రహింపగలము. పత్రి గ్రామ సమీపమునగల 'మన్వాత్' గ్రామవాసి అగును. బాబా ముఖ్య సందర్భములందు 'ఆఫకీరు' - అను పదము తఱచు ఉచ్చరించుటచే అతి బాల్యముననే సక్రమమైన పరివర్తనము ఆ ఫకీరు మూలముననే బాబాకు అల

వడిపదని మనకు తెలియుచున్నది. అతఁడొక మహాసీయుడు- జితేంద్రియుడు శుద్ధ వైరాగ్య పరిపూర్ణుఁడు- భగవద్భక్తుఁడగు గొప్పసాధువై యుండవచ్చును.

2- 6 సంవత్సరముల వయస్సులో ఆ ఫకీరు శిక్షణము వలన బాలుడగు బాబాకు వైరాగ్య - దైవభక్తి ప్రవృత్తులు సత్ప్రవర్తనము అలవడియుండును. బాబా ఆతని గురు దేవునిగ భావించినాడు. తనను కాపాడుచు, సక్రమపథమున నడిపించు దైవము - గురుదేవుఁడు - అను అర్థము స్ఫురించు పట్టుల బాబా 'ఆఫకీరు'- అను శబ్దము పలుకువాఁడు. ఈవిషయముల ననుసరించి ఆఫకీరు సూఫీ శాఖకుఁ జెందిన వాఁడై యుండ వచ్చును. సూఫీలు సమాధిస్థ పడయుచుందురు. ఆ స్థితిలో అరబ్బీ భాషలో "అనల్ హక్" ('అహంబ్రహ్మాఽస్మి' - అను మహావాక్యము) అని తమ స్థితినిగూర్చి పలుకుచుందురు. బాబా అప్పుడప్పుడు ఆ శబ్దము 'అనల్ హక్' - 'మైఁఅల్లా హూఁ' - అను పలుకు లుచ్చరించుట బాబా ఆశ్రితులు పలువురు వినియుండిరి. లక్ష్మీ నారాయణ - గణపతి - దత్త- మారుతి- విఠల్ -రామ- కృష్ణ మొదలగు రూపములు అల్లాఅనియు- తానిన్ని రూపములై యున్నాననియు తెలుపువాడు.

బాబా శిర్డిబ్రవేశించిన క్రొత్తలో అరబ్బీ పారశీ పదము లుచ్చరించువాడు.ఆ భాషలలో గేయములు ముఖ్యముగ 'కబీరు రచనలు' గానము చేయువాఁడు. కాళ్ళకు గజ్జలు చేతిలో చిఱుతలు ధరించి వివశుఁడై నాట్యము

చేయుచు గానము చేయువాఁడు. సూఫీ మతమున "i మన అజ్ఞానమే మనల పెడదారిని నడిపించుచున్నదనియు, ii మన బుద్ధిని పరతత్త్వమున లీనముచేసి, మనము చేయు ప్రతి కార్యము దైవముచేఁ గావింపఁ బడుచున్నదనియు అనగా 'కర్త' దేవుఁ డొక్కఁడే యనియు,' iii మనకుఁ గావలసిన సాధనము 'గురు' వొక్కఁడే యనియు, ఆ సద్గురువు బోధ ఉపదేశాదులచేగాక తన అద్భుత శక్తి ప్రేమలను తనవానిపై పఱపి, తన ఆశ్రితుని ఉద్ధరించు ననియు" తెలుపఁబడినది. గురువు తన అద్భుతమైన ఆత్మశక్తిచే శిష్యుని ఆత్మను తనకై వశము చేసికొని, చక్కదిద్ది, తనయందు లయముచేసికొని, తనకుఁగల జ్ఞాన శక్తుల ప్రసాదించి, "అపనా సరీకా కరితత్ కాల్" తనయంతవానినిగఁ జేయును.

ఈ లక్షణములు బాబావిషయమున తన గురువులయెడ ప్రవర్తనలో గాని, తన అంతేవాసులగు నానాసాహెబ్ చందోర్కరు ఉపాసనీబాబా మొదలగువారలను చక్కదిద్దుటలో గాని విదితములగుచున్నవి. బాబాను ఆ ఫకీరు మిక్కిలి బాల్య దశలోనే సర్వసద్గుణ పూర్ణుఁడగు బాలకునిగ చక్కదిద్ది, గోపాలరావు దేశముఖ్ - వేంకుశుని సమాశ్రయించుటకు యోగ్యుఁడగు శిష్యునిగ సిద్ధపఱచినాఁడు. బాబా భాగ్య విశేషము గమనింపుడు. హైందవ జననీజనకులనుండి మహమ్మదీయ సాధువుచేతులలోఁ బడినాఁడు. ఆ ఫకీరు రక్షణమునుండి తిరిగి హైందవ సాధువరేణ్యుని రక్షణమునకుఁ జేరినాఁడు. హైందవ మహమ్మదీయుల సాంఘిక సమైక్యత బోధించుటకు ముందు ఆ రెంటి సమైక్యస్థితి బాబాయందు చక్కగ పొందుపడినది.

ఇస్లాం మతము ఏకేశ్వరతత్త్వము గలది. హైందవ మతమున బహుదేవతారాధనము కలదు. హైందవుల గృహములందు పలువురు దేవతల చిత్రములను జూచుచుందుము. శ్రీరామ- కృష్ణ- వేంకటేశ్వర- లక్ష్మీనారాయణ- దత్త- గణపతి మొదలగునవి. ఆయా దేవతల సంబంధములగు పురాణ కథలను విశ్వసించి ఆయా నియమిత కాలముల ఆయా దేవతలను పూజించుచుందురు. ఇస్లాం మతమున దేవతలు పలువురు లేరు, దేవుడొక్కడే. తరువాత ప్రవక్త- మహమ్మద్, ఈ రెంటికంటె సత్యము వారెఱుఁగరు.

మన వేద వేదాంతములు 'సర్వమ్ ఖల్విదం బ్రహ్మ' మరియు - 'అంగాన్యన్యా దేవతా' - అని తెలుపుచున్నవి. సకలము బ్రహ్మస్వరూపమే. సకల దేవతలు ఆ పరమాత్మ యొక్క అంగములు. "నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ" అని యీ విధముగ సూర్యాగ్ని వరుణాదులను గూర్చి స్తుతులు గానవగును. కావున హైందవులచే వీరు పర్యాయమాన దైవస్వరూపులుగ భావింపబడుచున్నారు. 'మాతృ దేవోభవ'-'పితృ దేవోభవ'-'అతిథి దేవోభవ' ఇత్యాదులు హైందవేతరులకు బోధపడవు. "ఆచార్య దేవోభవ" అను విషయమున హైందవులతో పాటు మహమ్మదీయులు కొంత వరకు సమ్మతింతురు. సూఫీ మతమున సాధకుడు తన హృదయమున నిలుపుకొనదగిన దైవము- 'గురువు' ఒక్కడే గురువును ప్రేమించుట- గురువును ధ్యానించుట - గురువునందు మనస్సు లయింపఁజేయుటయే వారి మూలసిద్ధాంతములు. 'ఆచార్య దేవోభవ' అనునది తైత్తిరేయ ఉపనిషత్తునందు ప్రతిపాదితమైన సిద్ధాంతము.

బాబా సూఫీఫకీరురక్షణమునుండి శ్రీవేంకుశునిరక్షణమునఁ జేరెను. 'ఆచార్యదేవోభవ' అనునది సూఫీ-హైందవ మతములందు సమాన ధర్మమగుట- ఈ సిద్ధాంతము బాబాకు చలింపనీని పునాదైనది. శ్రీ వేంకుశుని సన్నిధిని పండ్రెండు సంవత్సరములు కడపిన విధానమును గూర్చి బాబా స్వయముగఁ దెలిపినాఁడు. (శ్రీసాయీకరుణ 80-85 పుటలు చూడుఁడు.) గురువు తనవలన కోరునది ప్రేమమాత్రమే, తాను కాంక్షించునది గురువుమాత్రమే. సంవత్సరములకొలఁది గురువేంకుశుని సేవించుచు ఆ గురుదేవుని నధిక ప్రేమతో చూచుచుండెడివాఁడు. ఈ విశ్వమునే సకలము మఱచినాఁడు. సూఫీ మతస్థులు కోరు ఏకాగ్రత అదియే. శ్రీకృష్ణచైతన్యప్రభువు మొదలగు ప్రేమమార్గావలంబులు ప్రతిపాదించిన సిద్ధాంతము- అమోఘ ఫలము ప్రసాదింప దక్షమైన "అనన్యభక్తి" అదియే. కావున సూఫీ ఫకీరునుండి వేంకుశుని రక్షణమున చేరుటలో పురోభివృద్ధియందు బాబా కెట్టి అంతరాయము కలుగలేదు. సాధనము సమానమే. సాధ్యము - ఫలము సమానమే. ప్రేమామృతాబ్ధియందు లయమొందుటే తుది ఫలము. అతి బాల్యమున సూఫీఫకీరు శిక్షణమున ప్రారంభమైన ఈ ప్రేమతత్త్వము గోపాలరావు వేంకుశుని రక్షణమునమున్న పండ్రెండు సంవత్సరములలో బాబాయందు పరాకాష్ఠ నొందినది. ఈ విధముగ మహమ్మదీయ - హైందవ ఐక్య సిద్ధాంతము బాబాయందు చక్కగ ఫలించినది. ఈ రెండు మతముల సిద్ధాంతసారము గమ్యమును- సంపూర్ణ సచ్చిదానంద స్థితిని- ప్రత్యాపేక్ష మార్గమునుఁ జేయుటయే.

కావున దైవనియమితబద్ధమై హైందవ- మహమ్మదీయ ఐక్య తత్త్వము బాబాయందు సంపూర్ణత్వము గాంచినది. బాబా తఱచుగ దైవమును నిర్దేశించి పెక్కు సందర్భముల అల్లా- ఫకీరు- లేక హరి అను పదములు వాడినాడు. అల్లా స్మరణ- హరి (నామ) స్మరణ- అను పదములు పర్యాయముగ అభేదదృష్టితో నుపయోగించినాడు. సామాన్యముగ మనము చూచు మహమ్మదీయ సాధు లీ రెండు శబ్దములు పర్యాయముగ వాడరు. కాని 'కబీరు' విషయమున ఈసమన్వయము- సమైక్యత మనకు గోచరింపగలదు. కబీరు సూఫీ మతస్థులకు గురువైనాడు.

హరినామమున సకల జగత్తత్త్వము నిర్దేశింపబడినది. కబీరు తన 'గురువు' అని బాబా తెలిపినాడు. ఒక సందర్భమున బాబా, యిట్లు పలికెను. "నాకు హృద్రోగ ముండెడిది. హరినామస్మరణము- అల్లాస్మరణము - చేయుచుండెడి వాడను, నా ఎదపై చేర్చికొనిన విష్ణుసహస్రనామములనుండి 'హరి' హృదయములోనికి దిగివచ్చినాడు. నేను స్వస్థత నొందినాడను" మఱియొక సందర్భమున కాకాదీక్షిత్ తో "నేను- 'హరి'- 'హరి'- యని స్మరించేవాడను. హరి ప్రత్యక్షమయ్యెను. ఆనాటినుండి వ్యాధిగ్రస్థులకు మందు లిచ్చుట ఆపివేసితిని. 'ఊధి'- (ద్వారకామాయి మసీదునందలి ధుని లోని విభూతి) మాత్రమే యిచ్చుచున్నాడను." అని పలికెను. కావున బాబాకు హరి- అల్లా ఇరువురు నొకరే. బాబా ఆశ్రితులై ఆ తండ్రి రక్షణములో నున్న వారందఱు పట్టి సమత్వము- సమైక్యభావముతో కలిగియున్నారు.

## 72 గంటల సమాధి

1886 సంవత్సరము బాబా జీవితచరిత్రయందు మహో త్కృష్టమైన ఘట్టమని చెప్పఁదగును. గురుదేవుఁడగు వేంకు శుని అనుగ్రహమున బాబా కోరకయే-యెట్టి ప్రయత్నములు చేయకయే సమస్త యోగైశ్వర్యములు- సకలసిద్ధులు బాబాను ఆశ్రయించినవి. బుద్ధిని పెడత్రోవల కీడ్చి, కలంచి 'కొమ్ములు తిరిగిన' యోగులను సైతము సర్వనాశనము చేయు నీ సిద్ధులను బాబా ఆదరించినవాఁడు కాఁడు. వానివంక కన్నెత్తిచూచి యైన నెఱుఁగడు. ఆ సకల సిద్ధులు- యోగైశ్వర్యములు చాలాకాలము 30- 35 సంవత్సరముల వరకు బాబా అను గ్రహమునకై ఆప్రభువుచెంత వేచియుండినవి.

భాగవతము పంచమ స్కంధమునఁ దెలుపఁ బడిన ఋషభునివలె శ్రీసాయీప్రభువు యోగైశ్వర్యముల సకల సిద్ధుల నాదరింపక నిరంతరము ప్రేమమయుండై హరినామ స్మరణము చేయుచుండెడివాఁడు. మనస్సును నమ్మదగదని పెద్దలు చెప్పుదురు. మనస్సు అనెడి బీజమున ఏ లవము 'పచ్చి' యుండిన కర్మాంకురమును బుట్టింప సమర్థమై యుం డును. అది పూర్ణముగ వేగినకాని దానిబలము నశింపదు. 1886 న జరిగిన అద్భుత సంఘటనతో శ్రీసాయీప్రభువు 'సాక్షాత్కారి' స్థితినుండి సంపూర్ణపరబ్రహ్మస్థితి- విశ్వమ యస్థితి- పొందినాఁడు.

మహా సమాధికి 32 సంవత్సరములకుఁ బూర్వము 1886 సంవత్సరమున సాయీప్రభువు 'సీమోల్లంఘనము' గావింపఁ జూచెను. అది మార్గశిర శుద్ధ పూర్ణిమ దినము.

బాబా ఉబ్బసముచే మిక్కిలి బాధపడుచుండెను. ఆ బాధ నుండి తప్పుకొనుటకు ప్రాణము నిరోధించి సమాధినొంద నిశ్చయించుకొనెను. మహల్సాపతినిఁ జూచి "నేను అల్లాను జేరఁబోవుచున్నాను. నా శరీరమును మూఁడు దినములు కాపాడుము. నేను తిరిగి వచ్చితినా సరే. తిరిగి రాకున్న ఈ నా శరీరమును ఆ వెలుపలి ప్రదేశమునం (వేలితోఁజూపించెను) భూస్థాపితము చేయుము. చిహ్నముగ నట రెండు జెండాలను పాతుము" అని చెప్పెను. రాత్రి 10 గంటలకు బాబా నేలపై వ్రాలెను. ఉచ్ఛ్వాస నిశ్వాసలు స్తంభించెను. నాడియు నాగెను. ప్రాణము శరీరమును విడచినట్లుండెను.

శిర్డి గ్రామములోని జనులెల్లరుఁ జేరిరి. బాబా మృతి నొందెనని తలంచిరి. పంచాయితీ జరిపి బాబా శరీరమును ఆయన నిర్దేశించిన స్థలమున భూస్థాపితముఁ జేయఁబూనిరి. కాని మహల్సాపతి అందుల కంగీకరింపకుండెను. ఆ శరీరము నెవ్వరినిఁ దాఁకనీయలేదు బాబా తలను తన తొడపైఁ బెట్టుకొని మూఁడు దినములు దివారాత్రములు ఆ శరీరమును కాపాడెను. నాలుగవనాడు వేకువజామున 4 గంటలకు బాబా శరీరమున ప్రాణ చిహ్నములు తోచెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు ప్రారంభమయ్యెను. ఉదర చలనము కాన్పించెను. నేత్రములు తెఱువఁబడెను. అవయవములు కాలుసేతులు సాచబడెను బాబా తిరిగి మేల్కొనెను.

బాబా తిరిగి భౌతికదేహమున ప్రవేశించిన తరువాత తాను భగవంతుని దర్శించితిననియు కొన్ని సంవత్సరములి

దుండి తాను గావింపఁదగినపనులు - ప్రజలకుఁ దాను జేయవలసిన మేలు- చేయుచుండెనని మహాల్సాపతితోఁ జెప్పెను.

లోకమున బ్రహ్మనిష్ఠులు మహాత్ములైన సాధువులు రెండు తెఱఁగులు. ప్రాపంచిక సంబంధము విడచి కేవల బ్రహ్మనిష్ఠులై నిర్వికల్ప సమాధియందుండి ఆత్మానంద మనుభవించువారు ఒకతరగతి. వీరు ప్రపంచమున నేజీవులతో ప్రత్యక్షముగ సంబంధము కల్పించుకొనరు. కాని వారి ప్రేమ రసప్రవాహము విశ్వమంతటను వ్యాపించుచుండును. సాధు సన్మార్గవర్తులగు వారలను వారనుగ్రహించుచునే యుందురు. అట్టిపరమ సాధువరేణ్యుల యునికిచేతనే విశ్వమున ధర్మ సత్యములు (రామాయణమున ప్రతిపాదితమైన ధర్మము- భగవద్గీతలందు నిరూపింపబడిన సత్యము,) సుస్థిరములై యున్నవి.

ఇక రెండవ తరగతి వారినిఁ గూర్చి విచారింతము.

" స తరతి స తరతి లోకాంస్తారయతి"
"అతఁడె తరియించుఁ దరియించు నతఁడె యెల్ల
ప్రాణుల తరింపఁగా జేయ వలఁతి యతఁడె"

(ప్రేమామృతము- (నారద భక్తిసూత్రములు ౫౦.)

అని చెప్పబడినటుల తాము తరించి ప్రపంచములోని జీవులఁ దరింపఁ జేయుచుందురు. అట్టి సమర్థ సద్గురువు బ్రహ్మసూత్రములు III- 3-3౨ సూత్రమునఁ జెప్పబడిన 'అధికారి' - పురుషుడు - లేక అవతారము - ఇట్టివారు ప్రపంచమున మెలఁగుచున్నట్లు ఇతరులకుఁ గనిపించినను వారు సదా బ్రహ్మనిష్ఠులే. వారిని లోభపఱచు వస్తువేమియును లేదు.

అట్టి సద్గురువు జగదంతర్యామియై చరించును. ఆమహానీయుఁడు కర్మములు చేసినను చేయనివాఁడే.

"న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి"
అనఘ పార్థ! నాకుఁ జేయంగఁ దగిన
కర్మమేదియు మూఁడు లోకముల లేదు ;
పొందఁబడినది, తగినది పొందుటకును
నాస్తియైనను గర్మము లాచరింతు.

(భగవద్గీతామృతము ౩-౨౨)

కావున మహాత్ములైన సాధువు లేపనిఁ గావించినను లోకుల నుద్ధరించుటకే కాని, వారికిఁ గావలసిన దేమియు లేదు. వారు ప్రేమస్వరూపులు. పెడమార్గమునందుఁ జరించు జీవులందు అవ్యాజ కరుణ వహించి ఈశ్వరప్రేమచే వారి నుద్ధరించుటకు ఈ భూమియందు సంచరింతురు.

'నరవర తరవర సంతజన చౌథాబర సేమేహ్
పరమార థకే కారనే, చారో ధారీ దేహ్'
సరసులంబుదములు సాధుజనంబు
తరువులు నీనాల్గు ధర ననిశంబు
పరులకు నుపకృతుల్ పఱుపఁగాఁ గోరి
ధరియించుచుండును దనువులవ్వారి.
విరఛాక బహూ ఫలంభజే, నదీ న అంచవై నీర్
పరమారథకే కారణే, సాధుధరా శరీర్.
త మఫలంబులఁ దరుల్ తాఁదినఁబోవు
తమ నీరముల నదుల్ తా గ్రోలఁబోవు
పరమార్థమతి సాధుపరులు దేహములు
ధరియించి పొనరింతు రల్లోకోపకృతులు.

(శ్రీ సాయీ కబీరు మూక్తులు)

ఓమ్

శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయినాథాయనమః

# సాయిబాబా కూడ దేవుడేనా?

## ఉన్న దేవుళ్ళు చాలకనా?

(సందేహ నివృత్తి)

## చతుర్థాంశము

---

శ్రీ సాయిబాబా చరిత్రను సావధానులమై పరిశీలించిన మనకీ సత్యము బోధపడగలదు. 1886 సంవత్సరమున 72 గంటల సమాధి పూర్వస్థితికి తరువాత స్థితికి సంబంధము లేదు. బాబా 'అల్లాను జూడబోవు చున్నాను' అని మహాల్సా పతితోఁ జెప్పి శరీరమును త్యజించెను. నాల్గవనాడు తిరిగి శరీరములోఁ బ్రవేశించి 'అల్లానుజూచితిని' అని ఆతనితోఁ జెప్పెను. 'అల్లానుజూచుట' - అనుపది అల్లా స్వరూపుఁడగు టయే. 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' బ్రహ్మ నెరిగినఁవాడు బ్రహ్మమే యగుచున్నాడు. విశ్వమయత్వము పొందుటయే. అది సర్వభూతాత్మ భూతాత్మస్థితి. ఆస్థితి నొందినవాఁడు

"సర్వతః పాణిపాదంత త్సర్వతోఽక్షి శిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి
అన్నియెడలఁ బాదహస్తంబు లన్నిట
నక్షులును శిరంబు లాస్యములును
గర్ణములును వెల్లఁ గలిగి యీలోక మం
దెల్లయెడల నావరించి యుండు."

(భగవద్గీతామృతము. ౧౩-౧౪)

అంతటఁ గరములు పదములు - అంతట నేత్రములు - శిరములు - ముఖములు - అంతటఁ గర్ణములు గలవాఁడై విశ్వమంతెల్లెడ నావరించియుండును. అతఁడు దైవమే. అట్టి స్థితినొందినవాఁడు షడ్విధైశ్వర్య సంపూర్ణుఁడు.

సర్వశక్తియుతము - సర్వజ్ఞత్వము - సర్వవ్యాపకత్వము - సర్వనియంతృత్వము గల వస్తువగు చున్నాఁడు. ఎక్కడేని - నెప్పుడేని నేమనేనిఁ జేయఁగలఁడు. "కర్తుమకర్తు మన్యథాకర్తుమ్ సమర్థః" సర్వభూతహృదయనియామకుఁడు పంచభూతతత్త్వముల కతీతుఁడు - వానికి ప్రభువు - త్రికాలవేది - ప్రేమస్వరూపుఁడు = జగత్పిత - విశ్వజనని - సకల భూత ప్రార్థనలు విని - అనుగ్రహింపఁగల అపారశక్తిసంపన్నుఁడగు దైవముగు చున్నాఁడు.

## బాబా సగుణ నిర్గుణ బ్రహ్మము:—

బాబా విశ్వమయస్థితి పొందినను తిరిగి పాంచభౌతికమగు శరీరమున ప్రవేశించెను గదా? అట్టివాఁడ 'దైవము' - అనియెట్లు చెప్పగలము? - అను సందేహము కలగవచ్చును. విశ్వమయత్వ మొకపరి పొందినతరువాత శరీరముండినను లేనిదియే. బాబా ఒకసందర్భమున

"ఈవు మామసజ్జి యీ శరీరం బొక
గృహమటంచు నీవు నెఱిఁగికొనుము
ప్రేమ నాగురుండు వేంకుశుం డెప్పుడో
యెత్తుకొనుచుఁ బోయె నింటనుండి" అనినాఁడు

శిర్డీయం దొకచోటఁ జేరి తన బిడ్డలతో మాటలాడుచు నే వేవో పనులు చేయుచున్నను విశ్వవ్యాపి యగుచున్నాఁడు ఎన్ని వేలమైళ్ళ దూరముననైన నెక్కడ నేమి జరుగుచున్నదో ఆ తండ్రి యెఱుంగును. అంతట వ్యాపించియున్నవానికిఁ దెలియని విషయ మేముండును? తనబిడ్డ లెక్కడెక్కడఁ గలరో వారిని వేయికన్నులఁ గనిపెట్టి రక్షించువాఁడు. బాబా సగుణ నిర్గుణ బ్రహ్మ మగుచున్నాఁడు. సామాన్యుల కిది బోధపడదు. దేహమున్నను దేహి కాఁడు. కర్మము లాచరించుచున్నను వానిచే బంధింపఁ బడఁడు.

"సాక్షాద్యద్యైకదేశే వర్తులముపలభ్యతే రవేర్బింబమ్
విశ్వం ప్రకాశయతి తత్పరైః సర్వత్ర దృశ్యతేయుగపత్

యద్యపి సాకారోఽయం తథైక దేశివిభాతి యదునాథః
సర్వగతః సర్వాత్మా – తథాప్యయం సచ్చిదానందః"

"అర్కబింబ మొండొకటఁ బ్రత్యక్షమగుచు
వర్తులాకృతి వడసి విశ్వంబు వెలుగు
నొందఁజేయుచునుండుఁ దానొక్క మొగిని
నెల్లరకును నెల్లెడలఁ గాన్పింపకున్నె ?
కాన నేకదేశగతుఁడైన, రూప స
మేతుఁడైనఁగాని యినుని మాడ్కి
సర్వగతుఁడు మఱియు సర్వాత్మ సచ్చిదా
నందమయుఁడు నందనందనుండు."

(ప్రబోధ సుధాకరము - సగుణ నిర్గుణైక్య ప్రకరణము)

కావున శ్రీ సాయినాథుడు శిర్డియందున్నట్లు కనబడినను శిర్డిలో లేడు. దేహము ధరించియు దేహి కాడు. సర్వవ్యాపి సర్వభూతాంతర్యామి యైనవాడు. పిలిచిన మాత్రముననే పలుకును. తలచిన మాత్రమున దాపు చేరును. అట్లు కావించుట సర్వవ్యాపకుడగు దైవమునకు దక్క మరి యితరులకు సాధ్యము కాదు.

బాబా తన ఆశ్రితులకు తన విశ్వవ్యాపకత్వాదు లెట్లు ప్రదర్శించి యెట్లు వారి ననుగ్రహించి లౌకిక ఆధ్యాత్మిక మార్గముల నన్నిట సిద్ధిని బొందించినది ఆయా భక్తుల అనుభవములను "ఏమని నిన్ను ప్రస్తుతింతునా?" అను గ్రంథమున వివరించబడినవి. కాని యన్నిటి నిట చేర్చిన వేరొక గ్రంథమగును. అట్టి విషయము లెన్నియో తెలిపినను సంశయాత్ములగు వారికి సమాధానపడుట కాలదు.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వాపరాం శాంతి మచిరేణాధి గచ్ఛతి॥
అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయంలోకోఽస్తి నపరో నసుఖం సంశయాత్మనః
జ్ఞానతత్పరుండు శ్రద్ధావంతుడు నౌ
సంయతేంద్రియుండు జ్ఞానమొందు;
అటుల జ్ఞానమొంది యచిరాన పొందును
శ్రేష్ఠమైన శాంతి శీఘ్రముగను.
శ్రద్ధలేనివాడు జ్ఞానవిహీనుండు
సంశయాత్ముడైన జనుడు చెడును;
సంశయాత్ముడైన జనునకు సుఖ మిచ
టేని బరమునందు నేని లేదు.

(భగవద్గీతామృతము. ౪-౩౯౪౦.)

అవతారములను — సమర్థ సద్గురువులను గూర్చి ఎవరికివారు అనుభవమునఁ దెలిసికొనవలయును గాని మఱి యొక విధమున నట్టి ప్రవచనములచేత నట్టివాఁడేని విశ్వాసముఁ గలిగింపఁ జాలదు.

శాస్త్ర గుణబోధలను మఱి స్వానుభవము
కలిమి నెద్దాని నరుఁడేమఁ దెలఁగ నమ్మ
నదియె శ్రేష్ఠంబు - పరమహో నదియు - నాదెల
గంబునఁజ వాని కవలంబనంబు - సాయి!

అనుసూక్తి సర్వమత సిద్ధాంతసారమని పాఠకులు గ్రహింప నగును

బాబా నాశ్రయించిన వివిధ మతస్థులు తా మొక మహా సిద్ధవస్తువు నెదుట నుంటిమని, ఆ సమర్థ సద్గురువు ద్వారా దైవమును పొందగలమని, మతవిభేదములు హాస్యాస్పదములని, జ్ఞానులగు తద్విదులు పాటింపఁ దగనివని గ్రహించిరి. బాబాను తమతము గురుదేవునిగ భావించి సేవించి తరించిరి. శ్రీ సాయిప్రభువు తనప్రజ నంగీకరించి వివిధ మత శాఖలందుఁ గల వైషమ్య మడంచి సర్వమత సమాహిత మగు మార్గమున నడుపు నవకాశముఁ గల్పించి మానవ సమాజమున పరస్పర ప్రేమ నెలకొల్పెను. సత్యభూత దయాది సుగుణ సంపదలను తన బిడ్డలయందు పెంపొందించెను.

అన లేసులు లోభము నన్యనింద
కపటము న సత్యము ను కామ ప్రవృత్తి
అగ్రహంబను నేవిమిది యవగుణముల
నవలఁ ద్రోయవె సాయీ పదాంకితుఁడు.

సాయిప్రభువు ననుగ్రహము సంపాదింపఁ దలంచినవారు ఈ పై నెనిమిది యవగుణములకు దూరము కావలయునని గ్రహించిరి. 'సాయిభక్తి' - యన - ఎల్లరయెడ సమాన బుద్ధి- దైవమునందు అచంచల విశ్వాసము- బాబాయందు సద్గురుభావము- వివిధ మతములందు ప్రతిపాదింపఁబడిన మూలసూత్రములను సమన్వయపఱచుకొనుట యని బాబా భక్తులు తెలిసికొనఁగల్గిరి. బాబా - ప్రేమపవిత్రతల రూపమని దైవశక్తి సంపదల ఆగారమని - ప్రత్యక్ష దైవమని గ్రహించిరి. "నేను మిమ్ముందఱఁ బ్రేమించునట్లు మీరొండొరులు ప్రేమించుకొనుడు." - అని బాబా పలుమారులు తెలిపినాఁడు. బాబా యెదుట ఎట్టి మతనిబంధనములు లేవు. సకలభూత హృదయాంతర్వర్తియై యెల్లెడల నెల్ల వేళల నేమిజరుగుచున్నదో తెలిసికొని, తనబిడ్డల కేడుగడయై అసాధ్యముల సాధింపఁజాలు సమర్థ సద్గురువు బాబా యెడ గాఢమగు ప్రేమఁ బఱపుటయే వివిధ మతస్థులగు బాబాఆశ్రితులకు సమాన ధర్మమైనది. ఆప్రేమ నిర్వంచిత నిరవధిక ప్రేమ ఆ-పిచ్చిప్రేమయే శ్రీసాయిప్రభువునెడ ఉపాయోపేయములైయున్నవి.

బాబా అట్టి ప్రేమచేతనే తన గురువు ననుగ్రహము సంపాదించుకొనెననియు, తన - యట్టి మహోన్నత స్థితికి ఆ ప్రేమయే మూలమని విస్పష్టముగ దెలిపినాఁడు. కష్టనివారణము అభీష్టసంసిద్ధియే ప్రతివ్యక్తియుఁ గోరునది. అది ప్రేమైక సాధ్యము. బాబా పాదములమ్రోల నెల్లరు వానిని సంపాదింపఁ గలిగిరి. సంపాదింపఁ గలరు. గురువును ప్రేమించు పట్టుల వారివారి మతములు ప్రతిబంధకములు కావయ్యెను.

## హిందూ మతమునకుఁ బవిత్రత–ఐక్యత :-

హిందూమతమునఁగల వివిధ శాఖలకు బాబా ఐక్యతఁ గూర్పఁజాలినాఁడు. అతి బాల్యమున సూఫీమతస్థుఁడగు ఫకీరు శిక్షణమునఁ బెరిగినాఁడు గావున 'దైవమొకఁడే' అను బుద్ధి బాబాయందు గాఢముగా పాదుకొనినది. 6వ సంవత్సరము మొదలు 18 వ సంవత్సరము వరకు (పండ్రెండు సంవత్సరములు సేలునందు గోపాలరావు దేశ్ ముఖ్ (వేంకుశుని) సేవయందుండి సర్వము గురువుగ భావించి, ప్రేమించి, సేవించిన కారణమున తాను బాల్యమున గ్రహించిన ఆ దైవము–అల్లా–తన గురువు సేవించు వేంకటేశ్వరుడుగఁ దెలిసికొనెను. ఇతర దైవరూపములు—తన గురువు తీర్థయాత్రలు సేవించినవి— ఆ దైవముయొక్క వివిధ నామ- రూపములుగ గుర్తించినాఁడు. "ఏకం సద్విప్రా బహుధా వదంతి" - సత్య వస్తువు ఒకటే - విజ్ఞులగు బుద్ధిశాలురు దానిని పలు విధములుగ పలుకుచుందురు' - అను నిగమోక్తియందలి సత్యమును యథార్థముగ గ్రహించినాఁడు. బాబా తన మతమున సకల నామరూపములుగల దైవమొకఁడే అను నిశ్చితజ్ఞానమును బాల్యముననే పొందగలిగినాఁడు. ఈ సత్యము తన బిడ్డల కెఱుకపఱచినాఁడు. ఈ స్థితి హైందవు లందఱు గుర్తించి పొందఁదగినది. 'ఈ సకలము–దైవము–అల్లా–అగును.' అను ఎఱుకను తనవారికి బాబా చక్కగా పాదుకొలిపినాఁడు.

బాబా సర్వ దేవతా స్వరూపుఁడు. శాస్త్రములు "అంగాన్యన్య దేవతాః"-(తైత్తరీయోపనిషత్తు) అని పలుకు

చున్నవి. ఆ తండ్రి సంపూర్ణస్థితి నొందినాఁడు. దైవరూప ములేకాదు - సకల దైవశక్తులు - సంపూర్ణ దైవత్వము బాబాయందుఁగలదు. సచ్చిదానంద విగ్రహుఁడు సాయీ నాఁథుడు. తనను గురుదేవునిగ భావించి, ప్రేమించి, సేవించు వారిని క్షేమకరమగు మార్గమున నడిపించి గమ్యమును జేర్పఁగల సమర్థత బాబాయందుఁ గలదు.

సచ్చిదానంద స్వరూపుడు దైవము. సర్వమతముల గమ్యస్థాన మావస్తువు. ప్రతిసాధకుఁడు ఆగమ్యమును దృష్టి యందుంచుకొని సాధనము చేయనగును. ఎల్ల అవతారములు- సద్గురువులు ఆప్రేమ స్వరూపమగు ఆ దైవమే - అనునదియే బాబా బోధలలోని సారము. మన భారతదేశములోను - ప్రపంచమునందుఁగల సకలమతముల సమీకరణమునకుఇదియే మూలాధారసూత్రము-అని మనము గ్రహింపవలయును.

హైందవ భక్తులు వారివారి యిష్టదైవములను బాబా యందుఁ జూడఁగలిగిరి. దక్షిణాఫ్రికానుండి వచ్చిన శ్రీరామ భక్తుఁడగు డాక్టరు శ్రీరాముని బాబాయందుఁ జూడ గలిగెను. అతనికిఁ బరమానందప్రేమలు బాబా ప్రసా దించెను. M. S. నిమోన్కర్ (పోలీస్ ఇన్‌స్పెక్టరు) హను మద్భక్తుడు. బాబా ఆతనికి హనుమంతునివలె గోచరించెను. M. G. చందోర్కరు బంధువు 'బిన్నేవాలా' - అనునతడు దత్తాత్రేయ భక్తుఁడు. అతనికి దత్తాత్రేయమూర్తిగ దర్శన మిచ్చెను. మేఘునకు (మేఘశ్యామునకు) శివుఁడుగ దర్శన

అనంతరమున శ్రీ సాయిప్రభువు సర్వాంతర్యామిగ, సర్వసమర్థుడుగ, సర్వనియంతగ భాసిల్లుచున్నాడు. తనబిడ్డల వేయికన్నులఁ గనిపెట్టి రక్షించుచున్నాడు. శాంతి సుఖములఁ ప్రసాదించుచున్నాడు.

మనపూర్వఋషులు ఉపనిషత్తులందుఁ జెప్పఁబడిన మహామునులు భగవదవతార సిద్ధాంతములను ప్రతిపాదించినారు. బృహదారణ్యక, ఛాందోగ్య, కఠ, శ్వేతాశ్వతరాద్యుపనిషత్తులు "ఈ విశ్వమున గల చేతనాచేతనము లీశ్వరమయము లనియు, అంతర్యామియు అధీశుఁడు సంరక్షకుఁడై భగవానుఁడున్నాఁడు" అనియుఁ దెలుపుచున్నవి. దీనికి ఉదాహరణ మైన నావలయుననిన 'శ్రీసాయిబాబా' అని చెప్పనగును. 'ఏమిా నిన్నుపేక్షింతునా?'- అను గ్రంథమున వివిధ సాయిభక్తుల వృత్తాంతముల సావధానులై చదువువారు వినువారీ సత్యమును గ్రహింపఁగలరు.

శ్రీ సాయిభక్తా! నేడు మన దేశమున వేలు లక్షల జీవులకు మతప్రాధాన్యత వహించినది. సాయిజ్యోతి యీ భూమియందు అష్టదిక్కులను దీపింపఁ జేయుచున్నది. దానిని మనము గమనించియు గమనించనట్లు పేక్షించుటవలన ప్రయోజనము లేదు. సాయిభక్తి జీవశక్తి-ప్రాణశక్తి-చిచ్ఛక్తి-యైనది. ఎల్లెడ మనుష్యుల భావములను చక్కదిద్దుచు మార్గదర్శకమై గమ్యమును జేర్ప సమర్థ మగుచున్నది. మన మీ విషయ మంగీకరించినను అంగీకరింపకున్నను దానికని అది భావించుచునే యుండును అది యీశ్వరేచ్ఛ. పురాకృత సుకృతముగల జీవి యీ సదవకాశమును వినియోగించుకొని తాను తరించి మనుష్యసంఘమును తరింపఁ జేయును.

భక్తిమతాచార్యులెల్లరు ఉదారాశయులు. సత్కరుణా ప్రపూర్ణులు. మాయాబద్ధులైన జీవులను తరింపఁ జేయుటయే వారి ముఖ్యాశయము. ఏ మతము పరిశీలించినను ఉదారాశయములందు స్పష్టమగును. కాని క్రమముగ నా మతానుయాయులు ఏవియో నిబంధనలను కల్పించి యన్యమతద్వేషాంకురములను నాటిరి. దానిచే పరస్పర ద్వేషములకు దారులు తీసిరి. ముఖ్య ధర్మములను విస్మరించి ఆచార వేషాదులకు ప్రాధాన్యమిచ్చి ప్రత్యేక కక్ష్యలు కల్పించుకొనిరి.

'ఏకః స్వాదు న భుంజీత' — 'మధుర వస్తువు దానొక్కఁడే భుజింపరాదు' - అను న్యాయము ననుసరించి మహాత్ములగు పరమ సాధువులు - మతస్థాపనాచార్యులు వారు "సత్యము" - "హితము" - అని విశ్వసించి సేవించి ఆనందించిన విషయ మెల్లరకుఁ జాటిరి. వారి ఉదారాశయములను గ్రోసి రాజని తరువాతవారు కక్ష్యలను పెంచుకొనిరి. శ్రీ రామానుజుని వృత్తాంతము గమనింపుఁడు. తనగురువు "పరమ రహస్యము - కైవల్యప్రదము" — అని, మంత్రరాజ ముపదేశించెను. "ఇతరులకు దెలిపిన నరకము పొందెదవు - మిక్కిలి గోప్యముగా నుంచుము" - అని, హెచ్చరించెను. జీవులను తరింపఁ జేయ జాలిన మహామంత్ర మెల్లరకు నుపదేశించి తాను నరకమున కైన సిద్ధపడి ఎత్తైన ప్రదేశము నెక్కి రామానుజుఁడు బిగ్గరగ 'అష్టాక్షరీ మంత్రమును' వినఁబలికెనని చెప్పుదురు. మతాచార్యుల భూతహితాసక్తి యిట్లుండునని పాఠకులు గ్రహింపనగును.

సకలావతారములు - సకల సాధువులు 'నేనే' యని బాబా తన బిడ్డలకు విస్పష్టము చేసినాడు. "ఏమి, నిన్నుపేక్షింతునా ?" (శ్రీసాయీ సద్గురుదేవచరిత్ర - భక్తుల అనుభవములు) అను గ్రంథమున అకల్‌కోట మహారాజా-నాందేడు మౌలా - నాగపూర్ తేజుద్దీన్ బాబా - వాసుదేవానంద సరస్వతీస్వామి - మొదలగు సాధు సిద్ధపురుషులకు శ్రీసాయీ బాబాకును గల అభేదస్థితి నిరూపింపఁబడినది. శ్రీసాయీ ప్రభువు అనుగ్రహించిన ఆ గ్రంథమును త్వరలో సోదర భక్తుల కందింపఁగలను.

అవతారంబులు సాధుసద్గురులు ప్రత్యక్షంబువౌ దైవ మ
ట్లవుటన్ వారి కొలందు లెన్నఁదగ, దవ్యాజామరాగాన నే
క విధిన్ జీవుల నుద్ధరించుటకు లోకంబందు వర్తింత్రు, వా
రెవరేన్ సేవ్యులటంచుఁ దెల్పవొకో? ఏమీ, నిన్ను పేక్షింతునా?

'సాయీబాబాకూడ దేవుఁడేనా?" - అని నామిత్రుఁడడిగిన ప్రశ్నమునకు సమాధానము - శ్రీ సాయీబాబా యొక్క- సర్వజ్ఞత్వ-సర్వవ్యాపకత్వ - సర్వనియంతృత్వ సర్వ సమర్థత్వములను స్వానుభవమున నెఱిఁగిన వారికెల్లరకు దేవుఁడే నిస్సందేహముగ దేవుఁడే. అట్టి అనుభూతి లేనివారికి దైవము కాకపోవచ్చును. దేవుఁడని కాకున్న పరమసాధువను తలంపు గలిగి గౌరవించినను సత్ఫలితము గలిగి తీరును.

ప్రభూతవు సీతువ గొంకుపోవువానికి ఆ బాధను నివారించి స్వస్థతను జేకూర్పఁజాలినది 'అగ్ని'యని వేఱుగఁ జెప్ప నేమిటని? గ్రీష్మాతప తప్తుఁడగు వానికి నిది శీతలచ్ఛాయనిడు వృక్షము దీనినీడ వసింపుమని యొకరు చెప్పనేల? అట్టి ఆతప

తప్పున కెక్కడ శ్రమనివారణమై సుఖసంతుష్టులు చేకూరునో అదియే వాని శాశ్రయ మగుచున్నది.

"ఉన్న దేవుళ్ళు చాలకనా ?" అను ప్రశ్నమునకు భగవానుడు తనబిడ్డల యందుఁగల అవ్యాజకరుణచే పలు మారు లవతరించి ధర్మము . సాధుమార్గము బోధించినాఁడు. కాని ఆబోధలను గ్రహింపఁజాలక మతవ్యామోహితులై, అన్యమతస్థులను ద్వేషించుచు ఇహమున-పరమున సుఖశాంతులు గాపక అలమటించు మానవసంఘము నుద్ధరించుటకే దైవము శ్రీసాయిబాబాగా అవతరింపవలసి వచ్చినది. వివిధ మత శాఖలకుఁజెందిన జనులు వేఱు-వేఱుగ భావించునగుణ రూపము లన్నియు నేకము-అవియన్నియు నేనే అనిబోధించి ప్రదర్శించుటకై దైవము సాయిప్రభువుగ అవతరించినాఁడు. సకలసాధువులు తానేఅనుఅనుభూతినితన వారికిఁగలిగించినాఁడు.

"విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితా సమదర్శినః.

వినయ విద్యలు గలిగిన విప్రునందు
గోవునందు నేనుఁగునందుఁ గుక్కయందు
నట్టిది భుజించు చండాలునందుఁ దుల్య
భావము ను గ్గలు వారలే ప్రాజ్ఞు లనఘ!" (భగవద్గీతామృతము- ౫-౧౮)

యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం నప్రణశ్యామి సచమే నప్రణశ్యతి.

ఎవడు సకలంబునందు నీక్షించునన్ను
నెవఁడు నాయందు సకల మీక్షించుచుండు;
జగతి వానికి నేఁ బరోక్షంబు నొంద,
వాఁడు నాకుఁ బరోక్షంబుఁ గాఁడు; పార్థ!" (భగవద్గీతామృతము. ౬-౩౦)

అను పరమార్థమును శాస్త్రములందుఁ జదివి, చిలుకపలుకుల వలె వల్లించుటగాక వారివారి యనుభవములందు తన బిడ్డల కెఱుకపఱచినాఁడు. ఎఱుకపఱచుచున్నాఁడు. భౌతిక వాదులు- స్వార్థపరులై జను లన్యోన్యహింసలకు గురియగు నిట్టికాలమున దైవము బాబాగా అవతరించవలసి వచ్చినది. ఆ తండ్రిబోధలను గ్రహించి అనుసరించినవారు సంతుష్టి సంతృప్తులఁ బడయగలరు.

1918 లో సాయిబాబా భౌతిక దేహము విడచినను ఎక్కడకుఁబో లేదు. అంతకు పూర్వ మెచటఁగలఁడో యిప్పుడు నచటనే కలఁడు. అంతటవ్యాపించి విశ్వమయుఁడై యున్నాఁడు. తన బిడ్డల నెల్లవేళల నెల్లవిధముల రక్షించుచు, సన్మార్గమున నడిపించుచు క్షేమముగ గమ్యమును జేర్చుటకుఁ జూచుచున్నాఁడు.

శ్రీ సాయికరుణ- ప్రథమ - ద్వితీయ భాగములలోని బాబాసూక్తులు, సందేశములు, అభయప్రదానములు పాఠకులు గ్రహింప ప్రార్థితులు.

నా మిత్రుని ప్రశ్నకారణమున శ్రీ సాయిబాబాను గూర్చిన సద్విషయము లించుక పలుకుట కవకాశము కలిగినది. అట్లు అడిగించినవాఁడు సాయినాథుఁడే. ఈ నాలుగు మాటలు సమాధానము వ్రాయించినది శ్రీసాయిప్రభువే. ఇట్టి సదవకాశము కలిగించిన మిత్రరూపుఁడగు శ్రీసాయికి వందనశతము లర్పించుచున్నాఁడను.

ఒక్క విషయము మాత్రమిట పలికి యీ చిన్న కృతిని బూర్తి చేయువాఁడను. పరమాత్మ నిర్గుణుఁడు - నిర్వికారుఁడు - నిరంజనుఁడు - నిరామయుఁడు-నిర్వికల్పుఁడు

నయ్యు భక్తుని ప్రేమోత్కంఠతలచే- దృఢవిశ్వాసముచే ప్రత్యక్షమై భక్తుని అనుగ్రహించుచున్నాడు. జీవియందుc గల ప్రేమవిశ్వాసములే సర్వవ్యాపకుడు నిరాకారుడగు పరమాత్మను ఏకదేశగతునిగ- సాకారునిగ- సర్వఫలప్రదాతగc జేయు సమర్థములై యున్నవి. ఇది త్రికాల సత్యము.

"యద్యపి గగనం శూన్యం తథాఽపి జలదామృతాంశు రూపేణ
చాతక చకోర నామ్నో ర్దృఢభావాత్పూర యత్యాశామ్
తద్వద్వ్రజతాం పుంసాం దృగ్వాఙ్మనసా మగోచరోఽపిహరిః
కృపయా ఫలత్య కస్మాత్ సత్యానందామృతేన విపులేన.

ఆకసంబు శూన్యంబైన నగును గాక
వారివాహ సుధాంశు రూపములc జేసి
చాతక చకోర సుదృఢ విశ్వాసముననె
యెల్ల వాంఛితములను బూరించు గాదె!
అఖిల వాఙ్మనముల కెందు నందరాని
కృష్ణసాయిప్రభుం డాశ్రయించువారి
నెప్పుడో యొకప్పుడు నిజకృపను జిలిపి
యమిత శాశ్వతానందామృతమున నింపు.

(ప్రబోధసుధాకరము - అనుగ్రహప్రకరణము)

ఆకసము శూన్యమైనను దృఢమైనవిశ్వాసబలమున చాతకమును మేఘరూపమున, చకోరమును చంద్రరూపమున నను గ్రహించి వాని కోరికలను దీర్చుచున్నది. ఆ విధముగనే ఊహించుటకు మనస్సునకు- పలుకుటకు వాక్కునకు అందని వాడైనను శ్రీసాయినాథాత్మ తన్నాశ్రయించువారి నెప్పుడో యొకప్పుడు తన కరుణను ప్రసరించి అమిత సచ్చిదానందామృతమున నింపును.

హరియన్నన్, హరుఁడన్న, సూర్యుఁడన, దత్తాత్రేయుఁడన్నన్, గణేశ్వరుఁడన్నన్, మహా-కాళియన్న, విధిన్, బ్రహ్మంబుఁ గర్మంబు, క్రీస్తరయన్, గౌతమబుద్ధుఁడ, ఖుదాయన, అల్లా యటంచన్న నీ పేరుఁగన్, జేయనె? 'సాయి' యన్న యని; యేమీ నిన్నుపేక్షింతునా ?

అవిరళైక వృత్త్యాకృతి సమరు నీ చ
రాచర ప్రపంచంబు సమావరించి
స్వీయపద మాశ్రితులను ప్రాపింపఁజేయు
సాయినాథ ! సద్గురుదేవ ! శరణు ! శరణు!

ఓమ్ శ్రీ సాయీ !

శ్రీ సమర్థ సద్గురుదేవుఁడు సాయీబాబా
ఎల్లర బుద్ధులను చక్కదిద్ది అనుగ్రహించుగాత !

శ్రీ సాయినాథార్పణమస్తు !

లోకా స్సమస్తా స్సుఖినో భవంతు !

ఓమ్

తత్ సత్.



# ఈ రచయితచే రచింపబడి పునర్ముద్రణకావలసిన గ్రంథములు

1. శ్రీ సాయీ కబీరు సూక్తులు
2. శ్రీ సాయీ సుభాషితములు
3. శ్రీ సాయీ మననము
4. శ్రీ సాయీ కరుణ
5. శ్రీ సాయీ విజయము (జంగమకథ)
6. శ్రీ సాయీనాథ బోధామృతము
7. శ్రీ సాయీ ప్రేమకిరణములు
8. శ్రీ సాయీ గీత
9. శ్రీకృష్ణకర్ణామృతము (శ్రీ లీలాశుక సంస్కృత కృతికి అనువాదము)
10. శ్రీ ప్రబోధ సుధాకరము (శ్రీ శంకర భగవత్పాద రచితము. శ్లోకములు- తెనుగు పద్యములు)
11. శ్రీనివాస దయా శతకము
12. శ్రీ ప్రేమామృతము (నారద భక్తి సూత్రములకు వ్యాఖ్య)
13. శ్రీ పుండరీక చరితము

## శ్రీసాయీ నిలయము ప్రచురణములు :

కీ॥ శే॥ శ్రీ బాపట్ల హనుమంతరావుగారి రచనలు

1. "ఏమీ ! నిన్నుపేక్షింతునా ?"
శ్రీ షిర్డీ సాయీబాబా జీవితచరిత్ర–
భక్తుల అనుభవములు 5 సంపుటములు
1200 పుటలు రు 30/-
2. శ్రీ సాయీ అనుసరణము 354 ,, రు 12/-
3. శ్రీ సాయీబాబా పూజాస్తవములు 88 ,, రు 2/
4. శ్రీరామా ! ఆపదుద్ధారకా ! (శతకము) రు 1/-
5. శ్రీ హనుమాన్ చాలీసా ! రు 1/-
6. శ్రీసాయిదేవ శతకము రు 1/-
7. శ్రీ వేంకటేశ్వరసుప్రభాతగీతములు మరియు
శ్రీ లక్ష్మీనారాయణ స్తోత్రమంజరి రు 3/-
8. శ్రీమద్భగవద్గీతామృతము రు 12/-
9. సాయీబాబాకూడా దేవుడేనా ?
ఉన్న దేవుళ్ళు చాలకనా ? (సందేహనివృత్తి) రు 8/-
(తపాలా ఖర్చులు ఉచితము)

ప్రతులకు :–

బాపట్ల వేంకట పార్థసారథి
శ్రీసాయీ నిలయమ్, చెరువు (P. O.)
గుంటూరు జిల్లా PIN – 522 113